# సంగీతము.

# తాళలక్షణము.



సంగీతవిద్వాన్

వింజమూరి వరాహ నరసింహాచార్యులు.

సంగీతగ్రంథమాల ద్వితీయపుష్పము.

# సంగీతము.

# తాళలక్షణము.



"శ్రుతులు-స్వరావళి" "త్యాగరాజచరిత్రము" గ్రంథకర్తయగు

సంగీతవిద్వాన్

వింజమూరి వరాహ నరసింహాచార్యులుగారిచే

రచియింపఁబడి ప్రచురింపఁబడియె.



కాకినాడ:

కాకినాడముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1934

 [వెల 0-8-0.

# FOREWARD

I have great pleasure in commending this publication for use by all students and lovers of Music. While Ragas and Raghalakshanas has been large in the general course of studies, it must be confessed that 'Thala' does not get adequate treatment in the bringing up of the students. What is taught is for the most part elementary. One reason may be that the published musical treatises give predominance to the Raga portion of the art; and practically there is no work dealing fully and satisfactorily with the 'Thala' system. The work of Mr. V. Narasimhacharlu is in this respect unique. It devotes itself entirely to 'Thala'; it is full and comprehensive and is based on the classical works on 'Thala'. It further gives us an idea of Thalam as obtaining in the Hindusthani, even Western music. This book is a valuable and welcome addition to our library. Every music school and college, I am of opinion, should do well to have the book as a text book of importance.

1-1-1934
MADRAS.

**Gayaka Sikhamani**
**L. Muthiah Bhagavathar,**
*Palace Vidwan, Mysore,*
*Principal Music Training College of The Music Academy, Madras.*

# OPINION.

To

*M. R. Ry.*

**V. V. Narasimhacharyulu garu,**

DEAR SIR,

Let me congratulate you on your excellent production " Thalalakshanam." It is exhaustive and instructive; and being practically the first work of its kind, it is bound to be useful to students of Music.

*Your Sincerely,*
T. L. VENKATARAMA AIYER, B. A., B. L.,
*Advocate, 4 Sannidhi Street, Mylapore.*

# పీఠిక.

తౌర్యత్రికమనబఱగు సంగీతమునకు దాళము ప్రధానమనుటకన్న ప్రాణమగుననుట చెల్లు. మనము నివసించు భూమండలము మరి సూర్యచంద్రాది మండలముల గమనము తాళబద్ధముగనే యున్నది. మన సమస్తవ్యాపారము తాళయుతముగనుంట గ్రహింపనగును. ఇట్లు ముఖ్యతమమగు తాళముగూర్చి ముఖ్యముగ సంగీతవిద్య నేర్చువారు విపులముగ దెలియుట యావశ్యకమగుచున్నది. తాళము నెఱుగనిది గీతవాద్యనృత్యములు ప్రకాశింపజేయుట సాహసమనుట మాత్రము కాక పూర్వపువాగ్గేయులు పాపమని యెంచిరి. అందుచే సంగీతజ్ఞులు తాళముంగూర్చి బాగుగ నెఱుగుట యావశ్యకమగుచున్నది.

తాళముంగూర్చి విపులముగజెప్పు గ్రంథములు మనకిప్పు డలభ్యములుగనే యున్నవి. అందుచే మనవారు తమ సంగీతగ్రంథములందు చెప్పుచున్న సంగతులు క్లుప్తములుగ నుంటయు నందుచే నపభ్రంశమూలకములగుటయు గ్రహింపబడుచున్నది. సవిస్తరముగను సంగీతము నేర్చు విద్యార్థులకు మరి విద్వాంసుల కుపకరించురీతి తాళముంగూర్చిన గ్రంథము యావశ్యకమగుచున్నదని గ్రహించి నేనీపుస్తకమును వ్రాయగడంగితిని. ఇందు దశప్రాణవివరణ మెంతేని యావశ్యకమగుచుండినను వీనియందలి కళ, యతి, ప్రస్తారములగూర్చి పూర్వపువాగ్గేయులు గొప్పమేర వ్రాసియుండి

నేడు సంస్కృతి సంగీతకాలమున నాచరణయందు కొంత కుంటి పడియుండుటచే దానిగూర్చి క్లుప్తముగ ముఖ్యమగు యంశములే చెప్పియుంటిమి తక్కిన యంశములగూర్చి చెప్పునప్పుడు అందందు పాశ్చాత్యుల యభిప్రాయములు, సారాంశములు, పోలికలు వీనితో జేర్చి చెప్పబడెను.

ఉత్తరహిందూదేశమున నిప్పుడు వాడుకయందుగల తాళములు, వీనియంశములు, అక్షరసంఖ్య మున్నగునవియు నిందు చెప్పబడెను. ఆయా సంగతులు గ్రంథవిస్తరభీతిచే గొంత క్లుప్తము చేయబడినందులకు పాఠకులు మన్నింతురుగాక కాని ఈ గ్రంథమున తాళముంగూర్చి తెలియవలయు సంగతులు చర్చనీయాంశములు ముఖ్యముగ జేర్చబడినవి.

ఈ గ్రంథము కొన్ని సంవత్సరములకు పూర్వము రచింపబడియు నచ్చొత్తించుటకు వీలు లేకపోయెను. కాని నాయందమిత వాత్సల్యము కలిగి నా శ్రేయము నపేక్షించు శ్రీ దివాన్ బహద్దర్ కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయుడుగారి సహాయముచే నచ్చొత్తించగలిగితిని.

సంగీత గ్రంథమాలయావమున నిట్లు లక్ష్యము ననుసరించు లక్షణగ్రంథము లావశ్యకమగుటచే మేమిట్లు సేయగలుగుటకు ఉదారులగు సంగీతశ్రేయోభిలాషుల ప్రోత్సాహము తోడ్పాటు అవశ్యకమగుచున్నదని మనవి.

వి. వ. న.

శ్రీమతే రామానుజాయనమః.

# తాళలక్షణము

ప్రకరణము

## ప్రస్తావన

"కల్యాణ గుణ సంపన్నం । కర్ణాంతాయత లోచనం ।
కౌసల్యాతనయం రామం । కలయే కమలాపతిం॥"

భారతదేశమునందు తక్కిన విద్యలవలె సంగీతవిద్యయు మిగుల యాదరణమునొంది యుండెననుట నిర్వివాదము. సంగీతమునకు తాళము సూర్యునకు వెలుతురువలెను, బంగారమునకు పళిమిరంగువోలె నన్యోన్యాశ్రయమై పరస్పరమై యొప్పుచున్నది ఇంతియే కాదు. తాళమొక్క సంగీతమునకే యట్లుగాక ప్రపంచమునకాధారభూతమగుచున్నది. ప్రకృతి తాళబద్ధమై యున్నది. లౌకికమందు సమస్త వ్యాపారము తాళము లేనిది పొసగదు. మనము నడచుటకును, పాగబండి పరుగిడుటకును మరి ప్రతివ్యాపారమునకును తాళ మావశ్యకము. అట్లు కాక, తాళహీనమైన, తొట్రుపాటుకలిగి అత్యాగి పొసగవు. తాళము లేనిదే ప్రపంచయాత్ర సుకరము కాదు. కావున నది ప్రకృతిసంబంధి యగుచున్నది. ఇంతియె కాక మన నాదు

యాధ్యాత్మికదృష్టితోఁ దిలకించి తాళము ఈశ్వరస్వరూపమనియు, మహేశ్వరుని చిరంతనతాండవ జనితమనియు నభిప్రాయ మిచ్చుచుండిరి. "శివశక్త్యాత్మికం పుణ్యం [illegible] భుక్తిముక్తిదం। దశప్రాణాత్మికం తాళం మోజాపాళిసతత్త్వవిత్॥" అనియు "వీణావాదన తత్త్వజ్ఞః శ్రుతిజాతివిశారదః। తాళజ్ఞశ్చాప్రయాసేన మోక్షమార్గం సగచ్ఛతి॥" అనియు చెప్పుచుండిరి. ఇందులకు నిదర్శనముగ మహేశ్వరుఁడు తాండవముసేయునట్లు నిర్మింపఁబడిన పురాతనపు విగ్రహములు, శిల్పములు నున్నవని ప్రాచీనవస్తుపరిశోధకసంఘము (Archealogical department) వారు కనుగొనుచునే యున్నారు. తాళహీనముగ గానము సేయువాఁడు పాపముచేసినవానివలె నరకమును పొందునని వక్కాణించు మనవారి సాహసము గమనింపునది.

శ్లో॥ గీతం వాద్యంచ నృత్యంచ తాళహీనం నరాజతే।
లోకేవేదేచ వచసాం పాదయోర్గతి రుత్తమా।
తాళేనైవ వినా తేన స్ఖలనం తేషు దృశ్యతే।
తౌర్యత్రికం తాళహీనం చాలయేత్పురుషాధమః।
సపాపీ నరకం ఘోరమాశు గచ్ఛతి సాన్వయః॥"

## తాళము—కవిత్వము.

ద్వైవిధమున తాళము ప్రపంచాధారమేయని యెంచునప్పుడు వాక్కులు తాళబద్ధమే యనకతప్పదు. పూర్వము నుండియు యీదేశమున ముఖ్యముగ కవిత్వము తాళయుత

ముగనే యున్నది. ప్రకృతిహితమగు నియ్యది మహాకవీశ్వరుఁడగు వాల్మీకి హృదయమునుండి సహజధోరణియై జనించిన కవిత్వమున కనుసరణముగ నలవడినదను సంగతి మనము మఱువకూడదు. వాల్మీకి తన హృదయవేదనమును వెల్లడించుతఱి తాళబద్ధముగనే యట్లు సేయఁగలుగుటకు కారణము, అది ప్రకృతిహితమగుటయే యని చెప్పనొప్పగు. ఇందుచే నీమహానీయుని వాక్యములు హృదయమునకును శ్రోత్రమునకును హాయి గొల్పుచున్నవి. ఈపద్ధతికవిత తక్కినవారందఱు ననుసరించి మేటికవులుగ వెలసియుండిరి. ఒక్క సంస్కృతకాలముననే యట్లు కవిత్వము తాళయుతముగ నుండక యాంధ్ర ద్రావిడ మొదలగు భాషలకాలమునను నేక భాషలయందును తాళము కలసియున్నదను సంగతియు విదితము.

ఇట్టి కవిత రెండు తెఱఁగులుగఁ జెప్పఁబడు. (1) ఇతిహాసము, (2) కావ్యము. కావ్యము తిరిగి రెండువిధములు. జయదేవకవి రచితమును మరి గద్యపద్యాత్మకమును యనునవి. పద్యసమితి పాదనియమములచే వృత్తములు, జాతులు నను భేదములు చెందును.

శ్లో॥ వృత్తం జాతిశ్చేతి ద్వివిధం పద్యంగణైర్నిసర్గాఢ్యై।
సంబద్ధం వృత్తం స్యాదుపగణ మాత్రాభి ర్నిబద్ధా జాతిః॥

## ప్రాచ్యపాశ్చాత్య వ్యత్యాసము.

కవిత్వము గణబద్ధముగ వెలయుట గమనింపఁబడెను. గణబద్ధమగునదెల్ల తాళనియమము కలదియే యగుచున్నది.

గణములు యక్షరములవలన నేర్పడినవి. అందుచే తాళ మీాదేశమున ప్రత్యేకముగ వర్ణాత్మకమైయున్నది. కాని పాశ్చాత్యుల భాష యక్షరములవలన నేర్పడక కొన్నివర్ణముల చేరికగల పదములందలి ఒత్తులు (accent) వలన కలిగినదగు టచే వారి తాళము అంత విపులమైనదిగ లేదు. "అలక లల్ల లాడగ గని" అను పదము మనకు చతురశ్రరూపకతాళమున రెండావృతములుగ నున్నది. కాని వారికి 'క' ఒత్తుకలదియై మరియొకవిధముగ 'అబ్రకేడబ్ర' (Abracadabra) గతిని నడచునదిగ నున్నది. ఇందుకొరకు కొన్ని యక్షరములు "అ" "ల్ల" మొదలైనవి యనవసరముగ దీర్ఘములు చేయబడియు మరికొన్ని 'క' వంటివి ఒత్తుకలవిగ జేయుటకు పొట్టివిగ నొనర్పఁబడియు బలుకవలసియుండును. ఉదాహరణము:- అలక్, లాల్లా. "ఎంతముద్దో ఎంతసొగసో" అనునది యాదితాళమున మనకు దృశ్యమగుచుండ పాశ్చాత్యుఁడు దీనియందలి ప్రతి పదమును ఒత్తులతో "ఎంత | ముద్దో | ఎంత | సొగసో | అని తాళవిభాగముసేయును. తాళమంతముఖ్యము కాదనునట్లు ఏరెండుమూడు విధముల తాళగతులతో మాత్రము పాశ్చాత్త్యులు సంతుష్టులైయుండిరి. కావుననే మనదేశపు తాళధోరణి వారి కగ్రాహ్యముగ నుండును. మనదేశపు ఈభాగ్యము వారికి కలుగకుండుటకు కారణము వారి కఠిత్వతత్వమందలి యాటంకమే.

కవిత్వమా యక్షరయుతముగ గణయుతముగ, మన్నదని యెంచితిమి. అనగా వర్ణావృత, మాత్రావృత యుతముగ నున్నది. వర్ణములు హ్రస్వదీర్ఘము లను రెండుభేదములు కలవి. హ్రస్వాక్షరములను లఘువులనియు దీర్ఘాక్షరములను గురువులనియు ఛందోకారులు వచించిరి. ఈయక్షరనియమమే లేక భేదమే తాళగతులను నిర్మించును. ఎట్లనైనను యక్షరభేదములవలన కవిత్వమేర్పడినట్లు తాళమేర్పడుచున్నది. పాశ్చాత్యులు తమ కవిత్వమందు హ్రస్వదీర్ఘభేదము నెఱుఁగరు. ఒత్తు కలవి ఒత్తు లేనివి యను భేదముమాత్రము వారికి కలదు. 'కీట్సు' కవీశ్వరుని యీవాక్యము చూచిన యిది స్పష్టమగును.

Upon the sodden ground His old right hand lay nerveless, listless, dead, Unsceptred:—

## మాత్రప్రమాణము.

కవిత్వమున యక్షరభేదములను పాటింపఁగాఁ గలుగు ప్రధానములగు యష్టగణములు మగణ, యగణ, రగణ, సగణ, తగణ, జగణ, భగణ, నగణంబులఁబోలు తాళలక్షణంబును మాత్రప్రమాణము (unit) వలన యేర్పడుచున్నది. అనగా కవిత్వము వర్ణావృత మాత్రావృత మగునట్లు తాళమును యగుచున్నది. మాత్రయన కవు లొకవిధమునను గాయకు లొకవిధమునను నర్థము జేసికొందురు. కాని పూర్వ

మునుండియు సంగీతశాస్త్రవేత్తలు మాత్రమున ప్రమాణము (unit) గ నెంచుచుండిరి. గ్రాహ్యమునకు వీలగు తక్కువ కాలపరిమితి మాత్ర యందురు. ఈ మాత్రనే గ్రీకులు (Chronos protos) అని వ్యవహరించుకొనిరి. ప్రస్తుతము వాడుక ననుసరించి సంగీతమున నిది పూర్వమువలె లేదనియే చెప్పవలసియున్నది. కొంతకాల మిది పంచలఘ్వక్షరోచ్చారణ కాలపరిమితి కలదగను, యనంతరము లఘు చతురక్షరోచ్చారణకాలము కలదిగను యెంచబడినట్లు విదితము. ఇటీవల కొందఱు మాత్రను నొక్కయక్షరకాలముగ నెంచిరి. భరతుఁడు 4 పాదములతోఁ గూడిన తాళము (పారిభాషిక) మాత్ర యని కవులు చెప్పినట్లు వచించెను. ఉదాహరణముగ నాలుగుపాదములుగల యేకకళ చచ్చత్పుటము ఒక మాత్ర యనియు, నిట్లు ద్వికళ చచ్చత్పుటము ద్విమాత్ర యనియు ఈమొదలగు సంగతులు చెప్పెను. శార్ఙ్గదేవుఁడు రత్నాకరమున నిట్లు చెప్పెను. "మాత్రా శబ్దే నాత్రాపి 'నిమేషకాలో మాత్రా స్యాత్'" మరియు

శ్లో॥ "పంచలఘ్వక్షరోచ్చారమితి మాత్రేతిహకథ్యతే ।
అనయా మాత్రయాఽత్రస్యాల్లఘుగుర్వాదికల్పనా॥"

ఇందుచే నిమిషకాలము పంచలఘ్వక్షరోచ్చారకాలమునకుఁ దుల్యమనియు నిదే మాత్రయనియు చెప్పఁబడినది. కల్లినాథుఁడు వ్యాఖ్యానమందు "తథాచోక్తం మునినా

"నిమేషాః పంచవిజ్ఞేయాః గతకాలే కలాన్తరమ్" అని చెప్పినాడు. క చ ట త ప అను అయిదు అక్షరము లుచ్చరించు కాలము మాత్రయనఁబడును. ఈప్రమాణము చేత ప్లుతగురుదృతానుదృత ప్రమాణములు పంచి వేసికొనునది. ఈ ప్రమాణము ననుసరించి "దశలఘ్వక్షరోచ్చార మితేన కాలేన గురుః" అనియు "పంచదశలఘ్వక్షరోచ్చారమితేన, కాలేనప్లుతః" అనియు గురుప్లుతములను జేర్కొనిరి. ఈప్రశంస మార్గతాళ ప్రకరణమం దుండుటచే నీసంగతులు మార్గతాళ మందలివి యని యెంచవలయును. ఇంకను పూర్వకాలమున అనగా వేదకాలమున మాత్రమనఁబడులు హ్రస్వ, దీర్ఘ, ప్లుతములను మూడుప్రమాణములు (units) వాడఁబడినట్లు విదితము. కాని శార్ఙ్గదేవుఁడు మున్నగువారు చెప్పు మాత్రప్రమాణము హ్రస్వమునకు తుల్యమగునెడల దీర్ఘ, ప్లుతములు గురుప్లుతములకు తుల్యములు కానోపు. ఇట్లు మాత్ర మార్గతాళములందు పంచలఘ్వక్షరోచ్చార కాలము కలదియయ్యు దేశితాళములందు చతురక్షరోచ్చార కాలముకలదిగనే యెంచఁబడుచున్నది. కావుననే లఘువునకు తుల్యమగుచున్నది. ఈమధ్య నేను విజయనగరము వెళ్లి యచ్చటి కళాశాలయందలి వస్తుపరిశోధనశాల (Laboratory) యందు గల శకంఠులుమాత్రము ప్రత్యేకముగ దెల్పు పెద్దఘడియారమునుండి మాత్రప్రమాణమును గ్రహింప

నెంచితిని. ప్రాచీనవాగ్గేయులు గ్రహించిన పంచలఘ్వక్షరోచ్చారకాలము పాశ్చాత్యుల శెకండుకు దుల్య మగుచున్నదని యిప్పుడు నేను నేర్చితిని. గడియారము ముందు నిలచి "తకిటతక" అను అక్షరము లుచ్చరింపుచు నిట్లు 10 మార్లు వ్రేళ్లచే లెక్కించి గడియారము శెకండముల్లును కనిపెట్టి చూచుచుంటిని. ఇప్పటికి 10 శెకండలు సదరుముల్లు జరిగెను. ఇట్లు యిరువది పర్యాయములు లెక్కజేసి అప్పుడెల్ల శెకండులు గమనించితిని. ఒకశెకనుకు 'తకిటతక' ఎన్నిసార్లుకలదో చూడగ నొక్కపర్యాయమే కలదని తేలినది. మరియు ప్రతి పర్యాయమునను అనగా 'తకిటతక' అనునప్పుడెల్ల ఆ ముల్లు ఒక్కగీతనుండి రెండవగీతకు తక్షణమే పడుచుండెను. కంటి దృష్టిదోషము (Parallax) నుండకుండగకూడ గమనించితిని. మరియు ముల్లు 'తకిటతక' అనునప్పుడెల్ల ఒకగడిని వీడుటచే నీదోషమునకును తావులేదు. ఇందుచే మన ప్రాచీనవాగ్గేయులు భరతాదులు గ్రహించిన పంచలఘ్వక్షరోచ్చారకాలము పాశ్చాత్యుల ఘడియారమునందలి ఇప్పటి ఒక శెకండుకు దుల్యమగుచున్నదని యెంచెదము. ఇట్లు వింతగ పూర్వపు సంగీతవేత్తలు చెప్పినకాలము నవీనపాశ్చాత్య శెకనుకు సరిపోవుట యదృష్టమే. ఇందుచే మన పూర్వులు కనుగొనిన కాలము ఘంటలు కొంతకాలముక్రితము పాశ్చాత్యులు కనుగొనరనుటకు వీలగుచున్నది. కాని యవంతరము ఏమికారణ

మునునో మాత్రకాలము లఘువునకు దుల్యముగునదిగ నెంచఁబడుటయు నందుచే నది చతురక్షరోచ్చారకాలపరిమితి కలదిగ మారి యుంటయు నాశ్చర్యమును కలుగఁజేయుచున్నది. లఘుప్రమాణము ననుసరించియే తక్కిన యంగములు గురుప్లుతములు కలిగినవి. ద్రుతము యర్ధలఘువే. వీని విలువలు మనవారి యంగగుర్తులతోను పాశ్చాత్యులగుర్తులతోను యిటచూడనగును.

| మనవారి యంగ గురు. | పేర్లు | విలువ. | పాశ్చాత్యుల గురు | పాశ్చాత్యుల పేర్లు. |
|---|---|---|---|---|
| O | ద్రుతము | అర్ధమాత్ర | ♪ | Quaver |
| I | లఘువు | మాత్ర | ♩ | Crotchet |
| S | గురువు | 2 మాత్రలు | d | Minim |
| Ṡ | ప్లుతం | 3 మాత్రలు | d | |

శ్లో॥ ఏకమాత్రో లఘురుక్తో । ద్విమాత్రో గురురుచ్యతే ।
త్రిమాత్రస్తు ప్లుతో జ్ఞేయ స్తదర్ధో ద్రుతముచ్యతే ।
ద్రుతార్ధస్తు అనుద్రుతస్యాత్ పరిమాణం కధితం బుధైః॥

ఈనాలుగంగములును ప్రథమము నుండియు నీదేశమున వాడఁబడుచుండినట్లు భరతుఁడు, శార్ఙ్గదేవుఁడు, నారదుఁడు, కోహలుఁడు మున్నగువారు చెప్పిరి. మరియు లఘుద్రుతములకు కొండొకచో విరామములనుకూడ చేర్చి చెప్పబడినట్లు రత్నాకరమునుండి గ్రహింతుము ద్రుతముతోఁగూడిన విరామము "ဝိ" గుర్తుగను లఘువుతోఁగూడిన విరామము "ٲ" గుర్తుగను చెప్పఁబడెను. పేరునకుమాత్రము మన మిప్పుడు చెప్పుకొను అనుద్రుతము, కాకపాదములు ప్రాచీనమున యనగా రత్నాకర కాలమునకు ఉండినట్లు లేదు. విరామమేయనుద్రుతమునఁ బఱగుచుండె కాఁబోలు.

ఈ నాలుగంగములును మరి పైవిరామములను చేర్చి పెక్కుతాళములను శార్ఙ్గదేవాదులు చెప్పియుండిరి. ఇందుచే గొంత భిన్నమతములతో 'రత్నాకరము'న నిట్టివి 120 తాళములును, 'సంగీతమకరందము'న 108 యు నిట్లు చెప్పఁబడెను* ఇందుచేఁ గవిత్వమున గణముల ప్రస్తారక్రమమున బెక్కువృత్తము లెట్లు కలిపించవచ్చునో యట్లే యీనాలుగంగములను ప్రస్తరించి పెక్కుతాళములను కలిపింప వచ్చునని గ్రహింతుము. అటులైన రత్నాకరమందలి తాళములు మాత్రమే కాక ఇంకను ప్రస్తరించగాఁ గలుగుతాళము లనేకములు గలవని యెంచవలయు.

* ఈతాళముల వివరణము చివరపుటయందు చూడనగును.

### తాళశబ్ద ఉత్పత్తి.

శ్లో॥ తాళ స్తల ప్రతిష్ఠాయా । మితిధాతోః పయోగతః ।
గీతం నృత్తం తథా వాద్యం । యతస్తాళే ప్రతిష్టితం॥

నృత్త గీత వాద్యములు ప్రతిష్ఠింపఁజేయుచు తల ప్రతిష్టాయామనే ధాతు నిష్పన్నమైనతాళ మనే సంజ్ఞ కలిగిన దాను.

### అధిదేవతలు.

శ్లో॥ "తకారం శంకరః ప్రోక్తో । లకార శ్శక్తిరుచ్యతే।
శివశక్తి సమాయోగా । త్తాళ నామాభిదియ్యతే॥"

సంగీతము ప్రాణాగ్ని సంయోగమువలన గలిగినదని యాధ్యాత్మికముగఁ జెప్పఁబడును. అనగా కార్యకారణ భూత మనందగు. ఈతత్త్వము నే ప్రకృతి శాస్త్ర వేత్తలం ధ్వని కలుగుటకు స్పందనలును, వీనినిఁ గలిగించు వస్తువును యావశ్యకములని యందురు. స్పందనలు గలుగుటకు యేదేని యొత్తిడి లేక సంఘర్షణము (friction) కావలయునుగదా. ఈ శక్తినే యగ్నిగాను, ఈ శక్తిని గలిగిన వస్తువును ప్రాణముగను మెంచబఁడును. అట్లైతే తాళము గలుగుటకును పైవిధముగు రెండును కావలయును. కావున నే తాళశబ్దమునకు పార్వతీశంకరుల నధిదేవతలుగఁ జెప్పి వీరి సంయోగమువలన తాళము పుట్టిన దందురు. ఆధ్యాత్మికదృష్టితోఁ దిలకించిన తాళము ప్రకృతిహితము కావున కాలస్వరూపమనియు నందు చే శాశ్వతను కలిగియుండుననియు నిది మెలుఁగుటచే మానవుఁడు

సులభముగా తరించగలడనియు నీసంగతులు స్ఫురించకపోవు. పాశ్చాత్యులును కాలము శాశ్వతమైనది 'Time is eternal' అని చెప్పుకొందురు. మనవారిట్లు చెప్పిరి.

శ్లో॥ సృష్ట్యాది లయ పర్యంతం వర్తమాన స్త్వగింద్రియః।
తాళోనిత్యోవినాశాదిపరిత్యయః స్ఫూర్తిగోచరః॥

ఇందుచే రెండుకరముల సంఘర్షణమువలన నెఱుగుట మొదలగు సశబ్ద మూలమును లేక నిశ్శబ్దమూలమునను తాళము మనము వినకపోయినను, గ్రహింపదగును. లక్షింపకున్నను యదిజరుగుచునే యున్నదని యెంచవలయును. ప్రకృతియందలి సంగీతమును సూర్యచంద్రాదులు, మరివీరి యనుచరులు, తారలు గావించు, యనంతగానమును మన వీనులు వినకపోయినను, హృదయము విని యానందించుచునే యున్నది. కవులును యీగానమాధుర్యమును విని తన్మయత్వమును పొందుచున్నారు. ఇట్లనే ప్రకృతియందలి తాళముచు- వైవిధమగు దినకరుల యనంతగమనాశ్రయ భూతమగు తాళమును మనశ్రవణేంద్రియము వినకపోయినను హృదయము విని యానందించుచునే యున్నది- ఉప్పొంగుచునే యున్నది. ఆశ్చర్యముజెంది శాశ్వతను పొందగోరుచుచేయున్నది. పాశ్చాత్యకవియొక్క యీవాక్యములు చూడుడు.

"What though in solemn silence all
Move round the dark terrestrial ball;

What though nor real voice nor sound
A midst their radiant orbs be found?
In Reason's ear they all rejoice,
And utter forth a glorious voice.

ఇట్లు యాధ్యాత్మిక తాళమునుండి యాధిభౌతికాను సరమగు తాళమువంకకు మరలుదము. లఘుగురుప్లుతాదులతో నొప్పి సశబ్ద నిశ్శబ్ద క్రియారూపమై గీతవాద్య నృత్యములననుసరించి తాళము నా బఱగుచున్నది. "గీతం నృత్తం తథా వాద్యం యతస్తాళే ప్రతిష్ఠితం" అనియు "తాళః కాలః క్రియామానం లయస్సామ్యమథాస్త్రియాం" (ఆంజనేయమతం) అనియు "కాలక్రియా చమానంచ సంభవం త్రియథావహా। తథాతాళస్య సంభూతి రితిజ్ఞేయాః చక్షణైః॥ (సంగీతార్ణవము) అనియు

శ్లో॥ కాలోలఘ్వాది మితయాక్రియయాసమ్మితామితం।
తితాద విఃదదత్తాళః సచద్వేధాబుధైస్మృతః॥

అనియు నిట్లు వారివారి మతములను గ్రహింతుము. మరియు సశబ్దాదిక్రియలననుసు వ్యాపించి యుండుకాలము లేక కాలపరిమితియు దాళమనంబడునని యెంచవలయును.

శ్లో॥ సంయోగేచ వియోగేచ। తలయోరుభయోర్యథా।
వర్తతేవ్యాప్తి మానాకాల। స్సతాళః పరికీర్తితః॥

కాని యిది సరికాదని మరియొకరిమతము వలన ఖండింపఁబడును. కాలము తాళమునకు ప్రాణముగఁ జెప్పఁబడును. కావున నదియే తాళమనుట చెల్లదు. ఇంతియే కాదు. ఇట్లు చెప్పఁబడుకాలము కనాశి అనగా ద్రుతకాలము, లఘుకాలము, గురుకాలము, ప్లుతకాలము, యిట్లు మార్పుచెందునది. ఇదియే తాళమగుచో నదియు నశించునదియే యని చెప్పవలయును. కావున కాలము తాళమునకు ప్రాణముకాని తాళము ప్రత్యేకము కానేరదని వీరిమతము.

"లఘుప్లుతాదిరూపాయ యనిత్యమితిగీయ్యతే|"

తాళవిషయముగూర్చిన గ్రంథములు మన దేశమున జెక్కులుండి యుండినవి. కాని అవిప్పు డలభ్యములుగనే యున్నవి. కోహలునిగ్రంథమునను మరికొన్ని పురాతనగ్రంథములలో బెక్కువాగ్గేయుల పుస్తకముల పేర్లు పేర్కొనబడినవి. కొన్నిపేర్లు చూడుడు. (1) గత్సాకరము (2) చూడామణి (3) తాళకళావిలాసం (4) నారదియ్యం (5) కాత్యాయనీయం (6) జయనీయం (7) సంగీతార్ణవము (8) ఆంజనేయప్రణీతం (9) చతురసభావిలాసం (10) విద్యావినోదం (11) మల్లభట్టీయం.



# తాళదశప్రాణలక్షణము.



## ప్రకరణము 2.

తాళము మార్గము దేశి అని రెండువిధములు. మార్గ తాళము దేశమున వాడబడదు దేశితాళమె పూర్వమునుండి యుం ప్రసిద్ధిజెందినది. ఇయ్యది దశప్రాణ సహితము. ప్రాణ మనగా సంరక్షించునదియని గ్రహింతుము. రాజునకు భృత్యుడు ప్రాణముండును. చీటికి [illegible] ప్రాణముండును. కావున కాలాదులు తాళమునకు ముఖ్యములనియు నెంచ నగును. ఈపది ప్రాణముల పేర్లు వరుసగ (1) కాలము, (2) మార్గము (3) క్రియ (4) అంగము (5) గ్రహము (6) జాతి (7) కళ (8) లయ (9) యతి (10) ప్రస్తారములు. ప్రతిసంగీత గ్రంథమందు నిట్లు వర్ణింపబడుట చూతుము. వీనివివరణము ప్రతి గ్రంథమందును మిగుల విపులముగ జెప్పబడెను. అదెల్లయు నిటు వ్రాయుట పడదు కావున ముఖ్యమగు సంగతులుమాత్రము క్లుప్తముగ జెప్పబడును. దశప్రాణము లిట్లు చెప్పబడెను.

శ్లో॥ కాలోమార్గః క్రియాంగాని గ్రహోజాతిః కళాలయః ।
యతిః ప్రస్తారకశ్చేతి తాళప్రాణ దశస్మృతాః॥

శ్లో॥ దశప్రాణ పరిజ్ఞాన । ప్రవీణస్తాళ ధారకః ।
నృత్యాదిషు ప్రశస్తస్స్యా । దితరస్తు మృతోపమః॥

ఎవఁడైనను తాళదశ ప్రాణపరిజ్ఞానము గలవాఁడు మాత్రము నృత్తగీతవాద్యములందు ప్రశస్తమైనవాఁడు. అట్టి పరిజ్ఞానము లేనివాఁడు ఆయావానియందసమర్థుఁడు అనికూడ చెప్పఁబడెను.

1. కాలము:—తాళమునకు కాలప్రమాణము ముఖ్యమని కొంత సూచితిమి. హ్రస్వదీర్ఘాక్షరములు బలుకునప్పటి యాలస్యమును కాలమందురు. అతిశీఘ్రము, శీఘ్రము, విళంబము, అతివిళంబము యిట్లు వరుసగ ద్రుత, లఘు, గురు, ప్లుత కాలము లనఁబడు విధమున నక్షరముల నొప్పించుక్రమము తాళమున ముఖ్యతమమని వేరు చెప్పనక్కఱ లేదు. ఇయ్యా దెఱుగనిదే తాళము నెఱుగుట దుస్తరము. బాగుగ తెలిసికొనినను కొంతశ్రమపడినపిమ్మట యలవాటువలన కాని కాలము నిలుపుట కుదరదు. బాగుగ నలవడినపిమ్మట దీనియందు మనదృష్టి లేకయే కాలము సరిగ యంత్రము (Machine) వలె నడచుచుండును. పాశ్చాత్యులు కాలమును యీదేశమునందు




వలె యంత్రజాగ్రత్తగా గమనించుటకు కొన్ని యంత్రములను ముఖ్యముగా ఛందోయంత్రము (Metronomy) నుపయోగించుచున్నారు. ఈపటములో చూపఁబడినట్లు 'అ' అను ముల్లు కుడి యెడమలకు జరుగునప్పుడెల్ల 'టిక్' శబ్దము కలుగును. ఈ 'టిక్' శబ్దము కలుగుటకు వలయు కాలము అనగా శీఘ్ర విళంబకాలములు ముల్లుపైనుండు మరదిమ్మ "ఇ" వలన క్రిందకు మీఁదకు జరిపి సరిచేయుదురు. కావున యీ యంత్రము సదరు కాలమును తూచినట్లు సరిగ నిలువబెట్టగలుగుచున్నది. ప్రథమమున తాళము నేర్చుకొనువారందరు యీ యంత్రమువలన కాలమును యెఱుఁగుట సుకరము. సాధారణముగ సంగీతవిద్యార్థులు గురువుగారివలన ముఖతహా నేర్చుకొందురు. కావున కాలము నట్లే నేర్చుకొనుట విదితము. కాని మందమతులు మున్నగువారు యీయంత్రమును యుపయోగించి సులభముగ నభ్యసింపవచ్చును. కాని యీ వాద్యమువలన తాళాంగములను క్రమముగను విపులముగను గొల్చుటకు వలనుపడదను వాదముకలదు. అట్లయ్యు తాళాంగము లాఖరున తెలుపు కాలమును యిదియు దెలుపుచున్నది కావునను, జాతిభేదము ననుసరించిన లఘువుయొక్క భేదములను మరదిమ్మవలన యేర్పఱుపవచ్చును. దీనిని పాశ్

కు లుపయోగింప నగును. కొంత కాలమునకు దీనియక్కర యుండదని తెలిపియుంటిమి.

మనము గ్రహించుటకు వీలగు శీఘ్ర కాలము 'క్షణము' అని వచింపఁబడును. దీని ప్రమాణము నూరు తామర రేకు లను దొంతరగఁ బెట్టి సూదిచే బొడువ నది దిగుట కెంత కాల మగునో యది క్షణము అని యిట్లు చెప్పఁబడెను.

శ్లో॥ ఉపర్యు పరి విన్యస్య । పద్మపత్రి శతం సకృత్ ।
సకాలః సూచిసంభేదా న్త క్షణస్య కలంపృతి॥

మరియు,

శ్లో॥ లవః క్షణైరష్టభి స్స్యాత్కాష్టా చాష్టలవాత్మకా ।
అష్టకాష్ట నిమేషః స్యా । న్నిమేషైరష్టభిః కళా॥

అని క్షణములు 8 అయిన ఒక లవకాలమనియు,
లవ కాలములు 8 ,, ఒక కాష్టం ,,
కాష్ట కాలములు 8 ,, ఒక నిమిషము ,,
నిమిషములు 8 ,, ఒక కళ ,,

ఇట్లు "తాళలక్షణ"మందు చెప్పఁబడెను. ఇంతియుకాదు.

శ్లో॥ కళాభ్యాంచ చతుర్భాగా చతుర్భాగమనుద్రుతం ।
అనుద్రుతాభ్యాం బిందుశ్చ బిందుభ్యాంతు లఘుర్భవేత్ ।
లఘుద్వంద్వం గురుశ్చైవ త్రిలఘుః ప్లుతముచ్యతే॥

2 కళలు = ఒక చతుర్భాగము
2 చతుర్భాగములు = ఒక అనుద్రుతము

| | | |
|---|---|---|
| 2 అనుద్రుతములు | = | ఒక ద్రుతము |
| 2 ద్రుతములు | = | ఒక లఘువు |
| 2 లఘువులు | = | ఒక గురువు |
| 3 లఘువులు | = | ఒక ప్లుతము |

ఇట్లు కాలముల వ్యత్యాసములు చెప్పఁబడెను.

(2) మార్గము:—ఇంతవరకు తాళమునందలి కాల ప్రమాణమును అనగా అక్షరముల హ్రస్వదీర్ఘములను తెలిపించు క్రమము చెప్పఁబడెను. ఇఁక ఒకయక్షరము మొదలు మరియొక యక్షరమువరకు ఇట్లు పదములు లేక యంగములు వీనిమధ్యను జరుగు కాలదీర్ఘము చెప్పఁబడును. దీనినే మార్గమందురు. ఇది నాలుగు విధములు అని కోహలుని "తాళలక్షణము"నఁ జెప్పఁబడినది.

శ్లో॥ మార్గాస్యు స్తత్ర చత్వారో ధ్రువశ్చిత్రశ్చవార్తికః ।
దక్షిణశ్చేతి తత్ర స్యాత్ ధ్రువకే మాత్రికా కలా ।
శేషేషు ద్వే చతస్రోऽష్టౌ క్రమాన్మాత్రాః కళాభవేత్॥

అని ధ్రువ, చిత్ర, వార్తిక, దక్షిణ మని మార్గములు నాలుగువిధములనియు, ధ్రువమార్గమం దొక్క-మాత్రకళయు, చిత్రయందు రెండును, వార్తికమందు నాలుగును, దక్షిణమందు ఎనిమిదియు గలవని చెప్పఁబడినది. నారదమతము ననుసరించి యివి (1) దక్షిణము, (2) వార్తికము, (3) చి

త్రము, (4) చిత్రతరము, (5) చిత్రతమము, (6) అతిచిత్రతమము అని యారువిధములు. వీనియందు వరుసగా దక్షిణమున 8 మాత్రల కాలమును, వార్తికమున 4 మాత్రల కాలమును, చిత్రమున 2 ను, చిత్రతరమున ఒక్కమాత్రయు,* చిత్రతమమున ద్రుతకాలమును, అతిచిత్రతమమున అనుద్రుతి కాలమును నడచును. ఈ మతమున ధ్రువమార్గము కాన్పించుటలేదు. చిత్రతరమార్గమే ధ్రువమని యెంచవలసియున్నది. శార్ఙ్గదేవుఁడును ధ్రువమార్గము మొదలగువానినే చెప్పెను.

శ్లో॥ దక్షిణో వార్తికశ్చైవ తథా చిత్రవిచిత్రకః।
తథా చిత్రతరస్తుస్యా దతి చిత్రతరోమతః॥

మఱియొకమతము (అనగా జైనమతము) ననుసరించి, (1) దక్షిణము (2) వార్తికము (3) చిత్రము (4) చిత్రతరము (5) చిత్రతమము (6) అతిచిత్రతమము (7) చతుర్భాగము (8) త్రుటి (9) అనుత్రుటి (10) ఘర్షణము (11) అనుఘర్షణము (12) స్వరము అను 12 మార్గములుకలవు. పైవిధమునజెప్పఁబడినట్లు అతిచిత్రతమము అనుద్రుతకాలము అనగా ఒక్కయక్షరకాలముకలది యగునుకద. చతుర్భాగము మోదుగమొగ్గవంటి యాకారముకలిగినయంగముగ నెంచఁబడను. ఇయ్యది అర్ధాక్షరకాలమును, త్రుటి పాతిక యక్షర

* ఒక్కమాత్ర కాలమున నాలుగక్షరములును, ద్రుత, అనుద్రుతములు వరుసగ రెండు ఒక్కయక్షరమును కలవని గ్రహించునది.

కాలమునను, అనుత్రుటి $\frac{1}{8}$ అక్షర కాలమునను, ఘర్షణము $\frac{1}{16}$ అక్షర కాలమును, అనుఘర్షణము $\frac{1}{32}$ ను, స్వర $\frac{1}{64}$ అక్షర కాలమును కలిగియున్నవి. అనుత్రుటివరకు గల 9 కాలములు గ్రాహ్యములనియు ఘర్షణము, అనుఘర్షణము స్వరలు యగ్రాహ్యములనియు నెంచవలసియున్నది. కాని నారదమతము అనగా దక్షిణము మొదలు అతిచిత్రతమము వరకుమాత్రమే గ్రాహ్యమని పెక్కుగ్రంథములందు చూతుము. మరియొక మతము (తాళకళావిలాసము వారు) దక్షిణ వార్తికములను విడచి (1) చిత్ర (2) చిత్రతర (3) చిత్రతమ (4) అతిచిత్రతమ మార్గములను నాలుగింటినిమాత్రము పేర్కొనిరి. ఇందుచే రెండక్షరములు మరి అంగములు వీనిమధ్య జరుగు కాలము ఎనిమిదియక్షరములకన్న విళంబమగు, 16, 32 అక్షరముల కాలమును కలిగిన వార్తిక దక్షిణ మార్గములను వీరు గ్రహింపనొల్లరు. అతిచిత్రతమము మొదలు స్వరవరకు గల ఏడును లక్ష్యమందు కనుపించని కారణమున దక్షిణము మొదలు ద్రుతమునకు తుల్యమగు చిత్రతమాంతమువరకు అయిన అయిదుమార్గములుమాత్రము గ్రాహ్యములని తెలిపిరి. అనుద్రుతము, ద్రుతలఘువులపై విరామముగ నెంచబడుటచే నిది ప్రత్యేకాంగముగ నుండదనియు వీరి మతము. కాని అనుద్రుతము యిప్పుడు వాడబడుటచే అతిచిత్రతమమార్గము అనగా నారదమతము ననుసరించి యారు మార్గములు ఇప్పుడునూ

గ్రాహ్యములే యని తెలుసు. ఈ నారదమతము కర్ణాటక గానమున కాధారముగ నెంచబడుచున్నది. ఔత్తరీయులు ఆంజనేయమతావలంబికులని చెప్పఁబడుదురు.

(3) క్రియ:—ఇదివరలో తాళము మార్గము దేశి అని రెండువిధములనియు మార్గతాళముకాక దేశితాళమే వాడఁబడుచుండుననియు దెలిపియుంటిమి. ఇట్టులయ్యు మార్గతాళముయొక్క క్రియలనిచ్చి ప్రతిగ్రంథకర్త విపులముగ వ్రాయుటచే వీనినిగూడ వివరించుట భావ్యమే. మార్గక్రియలు, దేశిక్రియలు అని క్రియలు రెండువిధములు. క్రియయనగా మార్గాదికాలమునందు గుర్తుగ చూపించుట. అనగా హస్తముచే సశబ్ద నిశ్శబ్దములకముగ కాలమును నిరూపించుట యగును. నిశ్శబ్దక్రియలు (1) ఆవాపము (2) నిష్క్రామము (3) విక్షేపము (4) ప్రవేశము అని 4 విధములు. సశబ్ద క్రియలు కూడ 4 విధములు (1) ధ్రువము (2) శమ్యము (3) తాళము (4) సన్నిపాతము అని వానిపేర్లు.

## హస్తవ్యాపారము.

1. ఆవాపమనగా అరచెయ్యి మీఁదుగా నిలపిన హస్తముయొక్క వ్రేళ్లను ముడుచుట.
2. నిష్క్రామమనగా అరచెయ్యిని క్రిందుగా నిలపి వ్రేళ్లనువిప్పుట.

3. విక్షేపము అనగా హస్తమును కుడిపార్శ్వమునకు విడలించుట.

4. ప్రవేశమనగా హస్తమును అప్రదక్షిణముగ ముందుకు రానిచ్చుట.

1. ఇక ధ్రువమనగా:- సశబ్దపూర్వక చిటిక వేసి హస్తమును వ్రాలనిచ్చుటయనియు,

2. శమ్యము:- కుడిచేతియందు యెడమచేతి ఘాత అని,

3. తాళము:- ఎడమచేతియందు కుడిచేతి ఘాత అని,

4. సన్నిపాతము:- అభిముఖముగు రెండుచేతుల ఘాత అని

ఇట్లు చెప్పఁబడెను. ఇవి చచ్చుత్పుటాది తాళములందు కలవు.

శ్లో॥ ఆవాపస్తత్ర హస్తస్యోత్తాన స్యాంగులికుంచనమ్ ।
నిష్క్రామోఽథ స్తలస్య స్యాదంగులీనాం ప్రసారణమ్ ।
క్షేపో దక్షిణపార్శ్వే స్యోత్తానస్య ప్రసృతాఙ్గులేః ।
విక్షేపోఽథ స్తలస్యాస్య ప్రవేశోఽంగులి కుంచనమ్ ।
ధ్రువో హస్తస్య పాతః స్యాచ్ఛోటికా శబ్దపూర్వకః ।
శమ్యా దక్షిణహస్తస్య తాలో వామకరస్యతు॥
తక్కిన వివరము "సంగీత రత్నాకరమున" చూడనగును.

ప్రకృతమున వాడుకయందు దేశి క్రియలు మాత్రము కలవని చెప్పఁబడెను. ఇవి (1) ధ్రువక (2) సర్పిణి (3) కృష్య (4) పద్మిని (5) విసర్జిత (6) విక్షిప్త (7) పతాక (8) పతిత అనునవి.

శ్లో॥ ధ్రువకా సర్పిణీకృష్యా పద్మినీ చవిసర్జితా ।
విక్షిప్తాచ పతాకాచ మాత్రిస్య త్పతితాష్టమీ॥

1. ధృవక:-పతాక హస్తముయొక్క వ్రేళ్లను ఘాతతో నరచేయ్యియందు కొట్టుట.
2. సర్పిణి:- పతాకహస్తమును ఎడమవైపునకు చాచుట.
3. కృష్య:- ఎడమనుండి కుడికి హస్తమును రానిచ్చుట.
4. పద్మిని:- అధోముఖముగ నరచెయ్యిని రానిచ్చుట.
5. విసర్జిత:- ఈపతాకహస్తమును ఊర్ధ్వముగావిసరుట.
6. విక్షిప్తము:- అధోముఖహస్తము తనవైపుకు వచ్చుట.
7. పతాక:- పతాకహస్తమును మీఁదకు ఎత్తుట.
8. పతిత:- ఇట్లు క్రిందకు దించుట. క్రిందివిధి చూడుడు.

శ్లో॥ సశబ్దో ధృవకాజ్ఞేయా సర్పిణీ వామగామినీ ।
కృష్యా దక్షిణతః పాతః పద్మినీ స్యాదధోగతా ।
విసర్పికా బహిర్యాతా విక్షిప్తా కుంచాత్మికా ।
పతాకా చోర్ధ్వగమనా పతితా కరపాతనా॥

ఇందుచే దేశిక్రియలందు 'ధృవక' ఒక్కటిమాత్రము సశబ్దక్రియ కలదనియు 'పద్మిని,' 'విసర్జిత'లకు పతాక, పతితలు కొద్ది వ్యత్యాసముతో తుల్యమే యగుచున్నవనియు నిందుచే నన్నియు వాడుకలో లేక కొన్నిమాత్రము ఇప్పుడు వాడఁబడుచున్నవనియు నెంతుము. వార్తికాదిమార్గములం దీక్రియ లెట్లు వాడఁబడుచున్నదియు నెంచునప్పుడు వార్తిక మార్గమునందు ధృవక సర్పిణి పతాకపతితలును, చిత్రమార్గ మున ధృవక పతితలును, చిత్రతరమున ధృవకయు నిట్లువచ్చు నని తెలియును.

# రెండవ ప్రకరణము

కవిత్వమునకు గణములెట్లో తాళమునందు అంగములట్లు. అందుచే అంగములు తాళము నిర్మించుటకు సాధనము లగును. తాళము అంగములచే నిర్మింపబడును. పైన చెప్పఁబడిన క్రియాది ప్రాణములు అంగములను కొలిపించుటకు వీలగుచున్నవి. ఇయ్యవి (1) ద్రుతము (2) లఘువు (3) గురువు (4) ప్లుతము అను నాలుగువిధములు. భరతుని "నాట్యశాస్త్రము" అనగా 4వ శతాబ్దమునుండి యు నీయంగములు భారతీయతాళమున కందును.

శ్లో॥ ప్రస్తారే తాలసంబంధి త్ర్యక్షరం స్యాచ్చతుర్విధం ।
సంక్షేపాత్పరిక్షేపం ద్రుతం లఘుగురుప్లుతం॥

ఇటీవలివారు వృత్తాను ద్రుతములనుకూడ యంగములుగ చెప్పియుండిరి. 'రత్నాకరమున' వీనిని లఘుగురువులపై విరామముగా జెప్పబడెను. కొన్ని గ్రంథములందుఁ (సంగీత మకరందము, తాలకలావిలాసం) అనుద్రుతముకూడ చేర్చబడి ఐదు అంగములు వర్ణింపఁబడినవి.

శ్లో॥ అనుద్రుతో ద్రుతశ్చైవ లఘుర్గురు స్తతః పరమ్।
ప్లుతశ్చేతి క్రమేణైవ తాలాంగానిచ పంచధా॥

అనుద్రుతమును శార్ఙ్గదేవుఁడు ప్రత్యేకముగఁ జెప్పకపోయినను విరామముగ గణించియుండెను. సంగీతరత్నాకరముకన్న ప్రాచీనమగు, (7 వ శతాబ్దమునాటిది) 'సంగీత మకరందమున అనుద్రుతము ఎంచబడుటచే నీయంగముకూడ

ప్రాచీనకాలమునుండియు వాడబడుట విదితము. కొన్ని యిటీవలి గ్రంథములందు కాకపాదము చెప్పబడెను. కాని యెప్పుడును లక్ష్యమున నదికానము. కొన్ని ప్రాచీనగ్రంథములందు

శ్లో॥ అనుద్రుతో ద్రుతశ్చైవ విరామ ద్రుతకో లఘుః ।
అవిరామగురుశ్చైవ ప్లుతశ్చేతి యథాక్రమం ।
సప్తాంగా విశ్రినోక్తా తేజ్ఞాత వ్యాస్తైసదాబుధైః॥

అని చెప్పబడినట్లు అనుద్రుతము, ద్రుతము, ద్రుతవిరామము లఘువు, లఘువిరామము, గురువు ప్లుతములను యేడంగములు చెప్పబడినవి. 3, 4 అక్షరముల మధ్య 3 అక్షరములుగల ద్రుత విరామమును, 5 అక్షరములుగల లఘువిరామమును యిట్లు చేసియక్షరములను కొలుచు తాళాంగములు చెప్పు వీరిమతము యాదరణీయము. మనకిప్పుడిని త్రిశ్ర, ఖండ జాతులకు తుల్యములు.

## అంగసంజ్ఞలు.

అంగసంజ్ఞలిట్లు వర్ణింపబడినవి.

శ్లో॥ అనుద్రుత స్వరూపంచ తద్బాలేందు కళాత్మకం ।
ద్రుతస్తువలయాకారం లఘురూర్ధ్వం శరాకృతిః ।
గురుర్వక్రిధను జ్ఞేయం ప్లుతస్య శిఖరోగురుః॥

అనుద్రుతము ◡ ద్రుతము O లఘువు | గురువు 8 ప్లుతము ʃ సంజ్ఞలచే నొప్పును.

## అధి దేవతలు.

వీని కధి దేవతలుకూడ చెప్పఁబడెను. ద్రుతమునకు ఈశ్వ రుఁడును, లఘువునకు పార్వతియు, గురువునకు వీరిరువురును ప్లుతమునకు త్రిమూర్తులును నధిదేవతలు.

శ్లో॥ ద్రుతస్య దేవతా శంభు ర్లఘో ర్గౌరీపతే స్మృతా ।
గౌరీ శివౌ చ గురుణి ప్లుతే బ్రహ్మాదయ స్త్రయః॥

అను ద్రుతమునకు ముఖ్యా చెప్పకపోవుటచే నిదియంగము విరామముగ మాత్రము గణింపఁబడెనని యెంచవలయును. "తాళము" పార్వతీశంకరుల వలన కలిగినదని చెప్పఁబడుటచే వీరివలన కలిగిన లఘుద్రుతములు తాళమునందు ప్రకృత ముగ చేర్పఁబడుచున్నవని గ్రహింతుము. ఈ రెండింటి ప్రస్తారమువలన మన తాళము లేర్పడినవని యూహింపనగును.

## అంగముల ప్రమాణము.

శ్లో॥ చతురంగుళ విస్తారం లఘ్వష్టాంగులం ప్రోక్తం గురౌ స్యాత్ ।
షోడశాంగులం ప్లుతే త్ర్యష్టాంగులం ప్రోక్తం తాలఘాతె...?॥

## పర్యాయపదములు.

(1) అనుద్రుతమునకు, అర్ధచంద్రము, వ్యంజనము అనునాసికము అవ్యక్తము లనునవియు, (2) ద్రుతమునకు అర్ధమాత్ర, వ్యోమమండి, బిందు, వలయ అనునవియు— (3) లఘువునకు మాత్రకము, సరళం, హ్రస్వం, కళ అనున వియు (4) గురువునకు ద్విమాత్రకం, కలా, దీర్ఘం, కేయూ రం, నూపురం, తాటకం, కంకణం, యమళం, కుళా అనియు.

(5) <u>ప్లుతమునకు</u> చతుర్మాత్రకం, త్ర్యంగః, సమోద్భవం అని యు నిట్లు పర్యాయపదములు చెప్పఁబడెను.

## అంగములందలి క్రియలు.

అనుద్రుతము వ్యంజనమని చెప్పఁబడుటచే, అచ్చులకు స్వరసంజ్ఞయు, హల్లులకు వ్యంజనసంజ్ఞయు గలదు. కావున (అనుద్రుతము) 'క' వర్ణాక్షరోచ్చారకాలము కలదిగ గ్రహింతుము. కాని దీనికి రెట్టింపు కాలము గల ద్రుతము 'కచ' అను రెండువర్ణముల వ్యంజనకాలము కలదికాదని గ్రహించునది. ఏలనన దీనికి శబ్దముతోఁ గూడిన క్రియకలదు. రెండు లఘువులు గల గురువు ఒక సశబ్దక్రియతో గూడిన లఘువును నిశ్శబ్దక్రియతో గూడిన లఘువును కలిగియున్నది. ఇట్లు మూడులఘువులు గల ప్లుతము ఒక్క సశబ్ద లఘువును రెండు నిశ్శబ్దలఘువులును కలిగియున్నది. కాని కాకపాదము నాలుగు నిశ్శబ్దలఘువులు కలదిగ నెంచబడెను. ఇట లఘువు వృద్ధిపొందుట లేదనియు వీనియందు మాత్ర సంజ్ఞకలదు కాని వ్యాపకసంజ్ఞ లేదనియు గ్రహించునది.

## ప్రకృతియందలి దృష్టాంతములు.

షడ్జాది స్వరము లెట్లు ప్రకృతియందలి మృగాదుల యరుపులతో బోల్చి చెప్పబడినవో అట్లే అనుద్రుతాది యంగ కాలములుకూడ విహంగాదులు చేయు కలస్వనముతో బోల్చి చెప్పు మన భారతీయ వాగ్గేయుల మానసీయ విజ్ఞానము

గ్రాహ్యమే. పాశ్చాత్త్యులీయంశము లిప్పుడిప్పుడే గ్రహించి జీర్ణించుకొనుచున్నారు. అనుద్రుతాదులను తిత్తిరాదు లిట్లు పలుకునని చెప్పబడినది.

శ్లో॥ తిత్తిరశ్చటక శ్చైవ బక చాతక కోకిలాః।
వాయసః కుక్కుట శ్చైవ క్రమా నుచ్చారయంతీమాన్॥

తీతువ అనుద్రుతమును పలుకును, పిచ్చుక ద్రుతమును పలుకును, కొంగ ద్రుతవిరామము బలుకును. వ్రమాయిపక్షి లఘువును, కోకిల లఘువిరామమును, కాకి గురువును, కోడి పుంజు ప్లుతమును బలుకును.

అంగముల నొప్పించు క్రమము.

శ్లో॥ అల్పఘాతః అనుద్రుతో సూక్ష్మఘాత ద్రుతో మతః ।
పూర్ణ ఘాత లఘుః ఉక్తా ఘాతకృ చే ద్గురుక్రమః।
ఘాతాకుగ భ్రమో యత్ర ప్లుతో జ్ఞేయో విచక్షు స్యాత్ ॥

అతిసూక్ష్మఘాత అనుద్రుతము, సూక్ష్మఘాత ద్రుతము. నిండు ఘాత లఘువు నని తెలియవలయు. ఘాతవేసి విక్షేప క్రియచే చూపుట గురువనియు, ఘాతవేసి హస్తము లాగి త్రిప్పేటప్పుడు ప్లుతమనియు దెలియవలయు. అనుద్రుత, ద్రుత, లఘువులందు అతిసూక్ష్మ సూక్ష్మఘాతలు వేసి శమ్యాది క్రియల చూపునది. గురువుయందు శమ్యా ప్రవేశములు చూపునది. ప్లుతమందు శమ్యా ప్రవేశము నిష్కర్షితలను చూపునది అనికూడ చెప్పబడెను. ఘాతక్రియకళలజూపుట:—మరియు ననుద్రుతమునకు $1\frac{1}{2}$ వ్రేళ్లుపొడవున హస్తమెత్తి ఘాత వేయవలయుననియు ద్రుతమున కిట్లు 3 వ్రేళ్లు, లఘువునకు 6 వ్రేళ్లు,

గురువునకు 6 వ్రేళ్లు పొడవున హస్తము త్రిప్పుత వేసి ఆరు వ్రేళ్లు పొడవగు పద్మినిక్రియ చూపవలెననియు, ప్లుతమునకు పైవిధమగు ఘాతవేసి 6 వ్రేళ్ళు పొడవగు ప్రవేశక్రియయు 6 వ్రేళ్ల పొడవగు విసర్జితక్రియయు జూపవలెనని ఇట్లు చెప్పబడెను.

శ్లో॥ సార్థ త్రి షష్ఠ ద్వాదశాష్టాదశాంతరం గుణైః ।
అనుద్రుతో ద్రుత లఘు గురుప్లుత ఇతిక్రమాత్ ॥

## లఘువు భేదములు.

ప్రాక్ప్రాచ్య వాడుక ననుసరించి లఘువు రెండువిధములుగ జూతుము. ఒకటి స్వతంత్రలఘువు, రెండు త్రిశ్రాది జాతిభేదములు గల లఘువు. మొదటివిధము చచ్చత్పుటాది తాళములు యమలునందుండినంతదనుక యుండెనసుట చెల్లు. ఈలఘువు అవినాశీ అనగా మార్పుచెందనిదిగ నెంచబడెను. అనంతరము తాళమున గురుప్లుతములు లక్ష్యమునుండి విరమింపబడినదాది లఘువు త్రిశ్రాదిజాతిభేదములను దాల్చునదిగనున్నది. లఘువును మాత్రగ (అనగ ప్రమాణముగ) నెంచితిమా రెండువిధములుగఁ జెప్పబడును. పంచలఘ్వక్షరోచ్చారకాలము కలది యని ఆంజనేయమతమునను చతురలఘ్వక్షరములుకలది యని యొకరిమతమునను చూతుము. గీతాది ప్రబంధములు వారివారిమతము ననుసరించి కూర్చునవి యనియు నిట్లు చెప్పబడెను. ఆంజనేయమతమున చతురశ్ర, త్రిశ్రజాతులుకాక తక్కిన మిశ్రజాతిని చతురశ్ర + త్రిశ్ర

ఇట్లును ఖండజాతిని త్రిశ్రలఘువు + అర్ధలఘువు ఇట్లును సంకీర్ణ జాతిని చతురశ్ర + త్రిశ్ర + అర్ధలఘువు ఇట్లును చెప్పుదురు.

5. గ్రహప్రాణము:- తౌర్యత్రిక రూపమగు సంగీతమందు తాళము నడచు విధమును గ్రహమందురు.

శ్లో॥ అద్యే నృత్తాదిసంబంధో గ్రహఇత్యభిధీయతే ।

నృత్త గీత వాద్యములు తాళానుగుణ్యముగ నడచు క్రమము గ్రహమని వ్యవహరింపబడును. ఇయ్యది (1) సమము (2) అతీతము (3) అనాగతము అని మూడు విధములు.

శ్లో॥ సమోతీ తానాగతశ్చ గ్రహస్తాళే త్రిధామతః॥

తాళముతో సమముగ అనగా తాళక్రియ మొదలు పెట్టగనే నృత్త గీతాదులును ప్రారంభించునప్పు డది సమ గ్రహ మందురు.

శ్లో॥ గీతాది సమకాలస్తు సమపాణి స్సమగ్రహః॥

నృత్త గీతాదులు తాళమునకు పూర్వమున నడచుచుండిన యాగతి అతీత మనఁబడును. ఇట తాళము గీతాదులకు వెనుక 'అవపాణి'గ నడచును.

శ్లో॥ సోఽవపాణి రతీతః స్యాధో గీతాదౌ ప్రవర్తతే॥

నృత్త గీత వాద్యములు తాళమునకు వెనుక నడచుచుండిన అనగా తాళము గీతాదులకు "ఉపరిపాణి"గ నడచు

చుండిన నది అనాగతగ్రహముగ నెంతుము. సామాన్యముగ కీర్తనాదు లిప్పుడీగ్రహముచొప్పున పాడఁబడుచున్నవి. ఇందుకు ప్రజ్ఞ మిగుల యావశ్యకము. శ్రీ త్యాగరాజుగారు యీమూఁడు గ్రహములు నొప్పించి "చెడేబుద్ధి మానరా" అను కీర్తనను పాడినారు.

విషమగ్రహము.

పూర్వపు శాస్త్రజ్ఞులలో గొందరు అనగా భటుఁడు, లొల్లటుఁడు మున్నగువారు 'విషమగ్రహము' గణింపనగునని తెలిపిరి. పై నియమములకు మించి అనగా ఒకప్పు డొక గ్రహము మరియొకప్పు డింకొకటి యిట్లు నడచుట విషమగ్రహమని వీరి తలంపు.

శ్లో॥ ఆద్యంత యోరనియమే విషమశ్చ ప్రకీర్తితః॥

కాని ఇయ్యది ప్పుడు గ్రాహ్యము కాదనునది నిదితము. మరియు,

శ్లో॥ లయః కర్మియాత్యమాదాస్యు మధ్య ద్రుత విళంబితః॥

అనునట్లు సమాతీతానాగతగ్రహములందు మధ్య ద్రుత విళంబిత లయలు వరుసగ వచ్చునని తెలియుచున్నది. దృష్టాంతముగ నొక చెలికాఁడు స్నేహితునితో సరిగ పోవుటను, వెనుక లేక ముందు పోవుటను గ్రహించునది. సమగ్రహమందు వార్తికమార్గమును, అతీతగ్రహమందు చిత్రమార్గమును అనాగతగ్రహమందు దక్షిణమార్గమును యిట్లు గ్రహింతుము.

6. జాతిప్రాణము:-పూర్వము అనగా గ్రామ రాగకాలము*నందలి చచ్చత్పుటాది తాళములు కాని నవీన కాలపు ధ్రువాదితాళములు కాని అంగములతో కూడుకొని యుండినను, ఈ తాళము లివ్విధమైనవి అను అనుగతబుద్ధి యే తాళమందలి జాతిగ నెంచఁబడెను. అశ్వాదిజాతిని బేర్కొ-నని దే మృగాదు లెట్లు యస్పష్టమో యట్లే తాళముకూడ జాతితోఁ బేర్కొ-ననిదే యస్పష్టమగుచున్నది. అందుచే జాతి కూడ తాళమునకుఁ బ్రాణమందురు.

శ్లో॥ చతురశ్ర త్రిశ్ర మిశ్ర ఖండసంకీర్ణ జాతయః।
చతుస్త్రి స్సప్తభిః పంచ నవభిస్స్వరసుద్ధృతైః॥

అని చెప్పఁబడినట్లు చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణములను అయిదుజాతులు తాళమున నెఱుఁగనగును.

వర్ణము:—చతురశ్రాది జాతులను బ్రాహ్మణాది జాతులతో బోల్చుటకు కారణము వానియందలి నీచోత్కృష్టముల నెఱుకపరచుటకే యందుము. మరియు వీనిని భార్యాభర్తలు మున్నగు విధమున చెప్పుటయు నాయాజాతి వేనినుండి

*సంగీతచరిత్ర క్రమముగ నెఱుఁగుటకు 13 వ శతాబ్దమువరకు ప్రాచీనకాలముగను అప్పటినుండి 18 వ శతాబ్దమువరకు మధ్యకాలముగను, ఇప్పటివరకు నవీనకాలముగను ఇట్లు యెంచవలసియున్నది. ఇట్లు ఆంధ్రపత్రిక ఉగాదిసంచికలందు నావ్యాసములందు చూడనగును.

సంభవమగునదియు దెలుపుటకే యనవలయును. ఆయాజాతి వర్ణమిట్లు చెప్పఁబడెను,

శ్లో॥ బ్రాహ్మణః చతురశ్రిస్స్యా । త్త్రిశ్రిః క్షత్రియఏవచ ।
మిశ్రి ఖండావైశ్య శూద్రి । సంకీర్ణః సంకరోభవేత్॥

ఇందుచే చతురశ్రము ప్రధానమైనదనియు, త్రిశ్రము తరువాత ముఖ్యమైనదనియు నిట్లు వరుసగ తక్కినవి ముఖ్యములనియు గ్రహింతుము. ఒకగ్రంధమున,

శ్లో॥ చతురశ్రి స్తధాభర్తః । త్రిశ్రిః పత్నీభవేత్పునః।
ఉభయోర్మేళనాన్మిశ్రి । జాతయో నాత్రిసంశయః ।
చతురశ్రి ఖండ త్రిశ్రి । యుక్తోఖండ విధాపునః ।
చతురశ్రి ఖండమిశ్రి । యుక్తో సంకీర్ణముచ్యతే॥

అని చెప్పఁబడుటచే చతురశ్రత్రిశ్ర జాతులనుండి తక్కినవి కలుగుచున్నవనియు, వీనియక్షరభేదములను పైసంగతివలన నెఱుగవచ్చుననియు గ్రహింతుము.

అక్షరసంఖ్య.

వీని యక్షరసంఖ్య చతురశ్రజాతియందు నాలుగక్షరములు త్రిశ్రయందు మూడును కలవని యెంచిన ఖండజాతియందు నైదును, మిశ్రయందు యేడును, సంకీర్ణజాతియందు తొమ్మిదియు వర్ణములు వచ్చును. ఈసంగతులు యీవిధమున చెప్పఁబడెను.

శ్లో॥ త్రిభిర్వర్ణై శ్చతుర్వర్ణై పంచవర్ణై స్తధైవచ ।
సప్తవర్ణైశ్చ నవభిః స్తగాత్రిదించవికల్పయేత్॥

మార్గతాళముల జాతులు:— జాతిభేదములు లేని స్వతంత్రలఘువుగల కాలమునందు అనగా చచ్చత్పుటాది తాళములు చెప్పఁబడుకాలమున సదరుతాళములే ఆయాజాతిలో జేర్కొనబడుట విదితము. ఈ సంగతులు సంగీతరత్నాకరమున విపులముగఁ గలవు. నాలుగు, మూడు యిట్లు యక్షర భేదములచేనాయాజాతి లఘువేర్పడినట్లు చతుర్లఘూచ్చారణ కాలముగలది చతురశ్రలఘువనియు నిట్టివిగల గురుప్లుతములతోగూడిన తాళము చతురశ్రజాతియనియు, త్రిలఘూచ్చారణ కాలముకలది త్రిశ్రలఘువనియు నిట్లు గురుప్లుతాదులతోగూడినతాళము త్రిశ్రజాతియనియు నిట్లు ఖండ, మిశ్ర, సంకీర్ణజాతుల తాళము లేర్పడుచున్నవనియు దెలియుదుము. ఆయాజాతిశబ్దము లిట్లు చెప్పఁబడెను.

తాక్క తోధిమి ధిమితక తధోం—చతురశ్రజాతి.
తాధి కిడత తక్క ధోం—త్రిశ్రః.
తోంగిట తక్కిటతోం తోంగిడ తకత తదాం—ఖండస్య.
తాధి తక్కిడ గిడతక ధిక్కిడ కిడతక తధాం తకదాం-మిశ్రః.
తద్రికిద్రకిద్ర త్తరికి త్తకతరికక త్తతరిక త్తరిడగిడతకదోం-సంకీర్ణః.

చచ్చత్పుటాదుల జాతులు.

చచ్చత్పుట చతురశ్రజాతి యనియు చాచత్పుట త్రిశ్రజాతి యనియు షట్పితాపుత్రిక త్రిశ్రజాతి యనియు సంపద్వేష్ట త్రిశ్రజాతి యనియు ఉద్ఘట్ట త్రిశ్రజాతి యనియు జెప్పఁబడెను.

ఇట్లు శార్ఙ్గదేవుఁడు రెండు జాతులు మాత్రము చెప్పుట చూడుడు.

శ్లో॥ చతురస్ర స్తథా త్ర్యస్ర ఇతి తాళో ద్విధామతః ।
చచ్చత్పుట శ్చాచపుట ఇతి నామ్నాతయోః క్రమాత్॥

ఇందుకు కారణము "సంకీర్ణ ఖండ మిశ్ర యోః అంత ర్భావతయా త్తస్మాత్ । పృథక్త్వేనో న పద్యతే॥" అని చెప్పఁబడుటయే.

కాని మరియొక మతము ననుసరించి నాలుగుభేదములు కలవు. మిశ్రజాతి సంకీర్ణమం దంతర్భూతముగ నెంచి ఇట్లు చెప్పిరి.

శ్లో॥ చతురశ్ర స్తథా త్ర్యశ్ర ఖండ సంకీర్ణ యేవ చ ।
తాళజాతి శ్చతుర్ధాస్యా న్మిశ్రస్తు నపృథగ్భవేత్॥

ఇటీవలివారు మిశ్రజాతినికూడ నెంచి అయిదుజాతులు చెప్పిరి.

7. కళాప్రాణము:— తాళమునందు సశబ్ద నిశ్శబ్ద క్రియలు చూపునప్పుడు "కళ" వ్యవహారం కలదని పూర్వపు వాగ్గేయుల యభిప్రాయము. ఇది మార్గతాళములందే† విదితము.

శ్లో॥ కళాశబ్ద క్రియయాంచ్చ । కాలేలఘునివిక్రకే ।
తత్రచైవ కళత్రాదా । కళావ_క్రం ప్రగియ్యతే॥

† చచ్చత్పుటాదితాళములు మార్గతాళములనఁ జెప్పఁబడెను.

'నిశ్శబ్ద' క్రియకు 'కళ' అనుట చెల్లునని "రత్నాకరము" నుండి గ్రహింతుము. ఇందుచేతను అంగములు నిరూపించు నప్పుడు గురువు మొదలగు వానియందు నిశ్శబ్దక్రియల ననుసరించి ఏకకళ, ద్వికళ యిట్లు వ్యవహరింపఁబడుట సదరు గ్రంథములందు చూతుము. కాని చతుర్భాగకాలమున తదర్థముగు 'కళ' కాలము ఇది యేయనబడునేమో? "అభినవతాళమంజరి" అను గ్రంథమున లఘ్వాది యంగములందు "ధ్రువక" మొదలగు ఏయేక్రియలు వచ్చునో నిరూపించుచో కళయని యెంచి యిట్లు వాని వివరణమంతయు వ్రాయఁబడెను. ఈపాఠభేదములవలన భిన్నాభిప్రాయములు పెక్కులు కలవన నాశ్చర్యము లేదు. కాని పూర్వపు గ్రంథములందు 'కళ' మార్గతాళములందే చెప్పబడుటయు, నప్పుడును నిశ్శబ్ద క్రియామూలకముగు గురువు ననుసరించి అనగా సదరు తాళము యథాక్షరకాలము కలిగినప్పుడు 'ఏకకళ' యనియు, ద్విగుణించిన కాలమున రెట్టింపు గురువులు కలదియైనప్పుడు 'ద్వికళ' యనియు, నాలుగురెట్లు కాలమున నాలుగురెట్లు గురువులు కలదియైన 'చతుష్కళ' యనియు నిట్లు మూడు విధములగు 'కళ'లు చెప్పఁబడుట విదితము. ఉదాహరణముగ చతురశ్రజాతి చచ్చత్పుట తాళము నాలుగుపాదములు కలది కావున ఒక్కొక్కపాదమందు ఒకగురువు చొప్పున నాలుగుగురువులు కలది యగుటచే నిది 'యేకకళ' యనియు, దీనికి ద్విగుణము అనగా ఒక్కొక్కపాదమందు

రెండు గురువులు చొప్పున ఎనిమిది గురువులుకలది 'ద్వికళ' యనియు మరివీనికి ద్విగుణము పైవిధమున బదునారుగురువులు కాలము నడచునది 'చతుష్కళ' యనియుఁ జెప్పఁబడును. ఇందువలన మార్గతాళములందు జాతిభేదముల ననుసరించి పాదములు మారుచుండునని గ్రహింతుము.

## వర్ధమాననష్టకళలు.

పాదభేదముల ననుసరించి గురువు లుండును కావున కళయు మారుచుంటచే నీవిధముగ వృద్ధిపొందునది వర్ధమాన కళ యనియు క్షీణించునది నష్టకళ యనియు గూడ నీతాళములందు చెప్పఁబడెను. నాలుగుపాదములు కలది ఏకకళ యైన రెండుపాదములు కలది 'యర్ధకళ' యనియు నొక్క పాదము కలది 'పాతికకళ' యనియు వ్యవహరింపఁబడును. ఈవిధమునకే నష్టకళ యందురు. పైన చెప్పబడిన విధమగు కళకు వర్ధమానకళ యని పేరు.

శ్లో॥ వర్ధమానా చ నష్టా చ తత్కళా ద్వివిధా పునః ।
యాకళా కాల మారభ్య గురుపర్యంత వృద్ధిగా ।
ఆ వ్యాత ద్విపరితేషు బుధై ర్నష్టకళోచ్యతే॥

## పాదభేదములు.

తాళమునకు జాతిభేదముచే పాదభేదములు కలుగు చున్నవి. చతురశ్రజాతి చచ్చత్పుటతాళము 4 పాదములు కలది. ఇయ్యది ఏకకళ గాని ద్వికళ గాని చతుష్కళ గాని

అయినప్పుడు వరుసగ 4 పాదములు కలది, రెండుపాదములు కలది ఒకపాదము కలది యని తెలియుదుము. ఇట్లు త్రిశ్రజాతి తాళమునకు 3 పాదములును ఖండజాతికి 2½ పాదములును మిశ్రజాతి తాళమునకు 3½ పాదములును సంకీర్ణజాతి తాళమునకు 4½ పాదములు ఇట్లు వచ్చునని తెలియుదుము.

### తాళములందు గురువుల నారయుట.

మార్గతాళములందు యథాక్షరముల ననుసరించి అనగా సదరు తాళము నామమున గల యక్షరముల ననుసరించి గురువు, లఘువు మొదలగు యంగముల నారయవచ్చునని చెప్పుదురు. ఉదాహరణము:—(1) 'చచ్చత్పుటః'అను తాళమునందు మొదటి రెండక్షరములు గురువులును, తరువాతది లఘువును, విసర్గయుతమగు 'టః' ప్లుతమును యని యెంచుటచే నీతాళమున గురు లఘు ప్లుతములు ఇట్లున్నవి. S S | Ś.

శ్లో॥ తాళే చచ్చత్పుటం జ్ఞేయం । గురు ద్వంద్వం లఘు ప్లుతం॥

ఇది ఏకకళ. ఇనుమడించు గురువులు కలిగిన ద్వి చతుష్కళ లగును. అనగా ఒక్కొక్క పాదమందు రెండు గురువులు ఉండినయెడల అయ్యది ద్వికళ యనియు ఒక్కొక్క పాదమందు 4 గురువులు ఉండిన అయ్యది చతుష్కళ యనియు నిట్లు గ్రహింతుము. ఉదాహరణము:—4 పాదములందు SSSSSSSS ఇట్లు గురువులుండిన నిది ద్వికళ చచ్చ

త్పుట తాళమగును. చతుష్కళతాళమునందు 16 గురువు లుండును. ఈచతుష్కళ చచ్చత్పుట తాళము ఒకమాత్రగ నెంచబడు చుండెనని తెలిపితిమి. ఇట్టి పారిభాషిక మాత్రలు 2 కలిగినప్పటి గురువునందు 32 గురువులు కలవని తెలియుదుము. ఈ పారిభాషిక గురువులు గల చచ్చత్పుట తాళము ఏకకళ యనియు నెంచవచ్చును. కాని ఈ కళపేరు ద్విగుణితైకకళ యనబడెను. ఇట్లు 128 స్వాభావిక గురువులు కలుగు వరకు లెక్కించవచ్చును. ఇట్టి సంగతులు పెక్కులు లక్షణ గ్రంథముల జూతుము. త్రికళ లేకపోవుట. ఇక్కడ త్రికళ వచింపకపోవుటకు గల కారణము త్రికళ అయిన చతురశ్ర తాళమునకును చతుష్కళ అయినత్రిశ్రజాతి తాళమునకును భేదముసిద్ధించుట లేదు. త్రిశ్రజాతిచాచత్పుట తాళమందు 12 గురువులు కలవు. కావున చతుష్కళ చాచత్పుటమునకును త్రికళయంగీకరించినచో చచ్చత్పుట త్రికళకును భేదము లేదు. అందుచే చతురశ్రజాతికి త్రికళసిద్ధింపదు. (2) చాచపుటం:— ఇది త్రిశ్రజాతి తాళముకద! పైవిధమున దీని యక్షరముల వలన వరుసగ గురువును, 2 లఘువులును, గురువుతో అంగము లిట్లున్నవి. SIIS.

శ్లో॥ భగణో గురు యుక్తశ్చే ద్భవే చ్చాచపుటాభిధః॥

ఇది ఏకకళ. ఇనుమడించు గురువులు కలిగిన ద్వి, చతుష్కళలగును. (3) షట్పితాపుత్రిక:—ఇది త్రిశ్రజాతి

తాళము. యథాక్షరములవలన దీనియందు వరుసగ ప్లుతము, లఘువు, రెండు గురువులు, లఘువు, ప్లుతములు ఇట్లు యారు వచ్చును. కావుననే యిది యారుపాదములు కలదియైనది. అంగము లిట్లున్నవి. ऽ I S S I ऽ.

శ్లో॥ "ఫలగాగల పాశ్చైవ షట్పితాపుత్రికే మతః"॥

4. ఉద్ఘట్టం:—ఇదియు త్రిశ్రజాతితాళమే. యథాక్షరములవలన వరుసగ గురువు, గురువు, గురువు వచ్చును. అంగము లిట్లుండును. S S S.

శ్లో॥ పూద్ఘట్టో మగణశ్చైవ॥

ఇది ఏకకళ. ఇనుమడించిన గురువులు కలిగినది. ద్వి, చతుష్కళలు కలదియగును.

5. సంపద్వేష్టకం:—ఇదియు త్రిశ్రజాతి తాళమే. యథాక్షరముల ననుసరించి వరుసగ ప్లుతము, మూడుగురువులు ప్లుతము ఇట్లు కలవని గ్రహింతుము. అంగము లిట్లుండును. ऽ S S S ऽ.

శ్లో. మగణస్స్యప్లుతాద్యంత్త సంపద్వేష్టికాయిమ్యతే॥

ఇది షట్పితాపుత్రికవలె యారుపాదములు కలది. పైవిధమున నిది ఏకకళయనియు, ద్వికళ పన్నెండుగురువులు కలదియు, చతుష్కళ యిరువదినాలుగు గురువులు కలదియు నగునని గ్రహింతుము.

పై యైదుతాళములు మిగిలినవాని కన్న ముఖ్యము లని చెప్పుటకు కారణాలు యివి సదాశివుని పంచముఖముల

నుండి పుట్టిన వని మనవారు చెప్పిరి. చచ్చత్పుటము శివుని 'సద్యోజాతకి' ముఖమునుండియు, చాచపుటము, 'వామదేవ' ముఖమునుండియు, షట్పితాపుత్రిక 'అఘోర' ముఖమునుండియు, ఉద్ఘట్టం 'తత్పురుష' నుండియు, సంపద్వేష్టికం 'ఈశానము' నుండియు నుద్భవించెనని చెప్పఁబడెను.

శ్లో॥ సద్యోజాతి వామదేవా దఘోరాన్మంకస్యతు ।
తత్పురాధీశానాశ్చ మార్గతాళః సముద్భవేత్॥

వీనియందు క్రియలు వాడువిధము.

తాళమునందలి క్రియలనొప్పించువిధము నారయుటకు తాళాంగములందు యివి యెట్లొప్పింతురో తెలియవలయు. ప్లుతమంను మూడుక్రియలు, గురువునకు రెండును, లఘువునకు ఒక్కటియు, ద్రుతానుద్రుతములకు అర్ధ పాతిక క్రియయు గలుగును. అనగా ప్లుతమందు ధ్రువక, కృష్య, సర్పిణియు; గురువునందు ధ్రువక, పతితలును; లఘువునందు ధ్రువకయు; ద్రుతానుద్రుతములకు ధ్రువకమందు యర్ధము, పాతికక్రియయు నిట్లు వచ్చును. ఈసంగతి "తాళలక్షణము"న నిట్లు చెప్పఁబడెను.

శ్లో॥ ధ్రువకా కృష్యసర్పిణ్యేప్లుతే గాల్యాగురౌపునః ।
ధ్రువకా పతితశ్చైవ శేషేషు ధ్రువకాస్మృతాః॥

ఇవెల్ల దేశిక్రియ లగుటవలన దేశితాళములందీ యంగముల నిటు లొప్పించునది. కాని మార్గతాళములందు మార్గ క్రియలనే అనగా శమ్యము, తాళము మున్నగువానినే యొప్పిం

చుటగూర్చి "భరతనాట్యశాస్త్రము" "సంగీతరత్నాకరము" మొదలగు గ్రంథములఁ జూతుము. చచ్చత్పుటమునకు సన్నిపాతము, శమ్యము, తాళము, శమ్యమువచ్చును. "చచ్చత్పుటే త్వేకకళె సంశతాళం యథాక్రమమ్" అని

S S I S
సం శ తా శ

ఇట్లు చెప్పఁబడెను. మిగిలిన తాళములకు యీవిధమగు సంగతులు విపులముగ "సంగీతరత్నాకరము"న చెప్పఁబడెను.

8. లయాప్రాణము:-తాళమునందలి క్రియలు ముగిసిన వెనుక తిరిగి సదరు క్రియలు ప్రవర్తించునప్పటి విశ్రాంతి(Rest) లయ యనబడును.

"క్రియానన్తర విశ్రాన్తిర్లయః" అని చెప్పఁబడెను.

ఇయ్యది ద్రుత, మధ్య, విళంబితము లని మూడు విధములు.

శ్లో॥ ద్రుతో మధ్యో విళంబశ్చ ద్రుతః శీఘ్రతమో మతః ।
ద్విగుణ ద్విగుణౌజ్ఞేయా తస్మాన్మధ్య విళంబితౌ॥

మార్గతాళములందు కళాభేదము ననుసరించి మార్గభేదములు కలుగుచున్నవి కద! మార్గమందు తిరిగి యీ మూడువిధములు లయయు గలవనియు, దక్షిణమార్గమున విళంబిత లయయు, జిత్రమార్గమున ద్రుతలయయు, వార్తిక మార్గమున మధ్యలయయు వచ్చునని ఇట్లు చెప్పఁబడెను. ఈసంగతులు సప్రమాణముగ కోహలుని "తాళలక్షణమున"

జెప్పఁబడెను. మరియు త్రిశ్ర, మిశ్ర ఖండ సంకీర్ణ జాతులందు బేసి సంఖ్య యక్షరములుంటచే ద్రుతలయ లేదు. చతురశ్రాది సరిసంఖ్య యక్షరములు గల జాతులందు పై 3 లయయు నొప్పును.

9. యతిప్రాణము:-తాళమునందలి లయప్రవర్తించుటకు గల నియమము యతి యనబడును. "లయ ప్రవృత్తినియమో యతిరిత్యభిధీయతే॥" కాని తాళమునందలి యంగములుండు విధము యతినాబఱగు ననుయర్థమిటీవల ప్రబలుట గమనీయము. లయద్రుత మధ్య విళంబితములను మూడువిధములుగ కద తెలిసితిమి. యతి లయను ప్రవర్తింపఁజేయును కావున నిదియు సమయతి స్రోతోవహాయతి, గోపుచ్ఛయతి అని మూడువిధములుగఁ జెప్పుదురు. ద్రుతలయ చిత్రమార్గమందు పరిస్పష్టము కావున చిత్రమార్గమున ద్రుతలయ నడచునప్పుడు సమయతియు, వార్తికమార్గమందు మధ్యలయ యగునప్పుడు స్రోతోవహా యతియు దక్షిణ మార్గమందు విళంబిత లయ యగును కావున గోపుచ్ఛయతియు నిట్లు ప్రవృత్తికలుగును. ఉదాహారణముగ (1) దక్షిణమార్గము, తరువాత వార్తికము యిట్లును (2) విళంబ మధ్య లయ నడచునప్పుడును, (3)మధ్య లయ యాదియందును తరువాత ద్రుతలయ యిట్లు నడచునప్పుడును ఈమూడింటియందు స్రోతోవహాయతి విస్పష్టము.

(1) ప్రథమమున ద్రుతలయ, యనంతరము మధ్యవిళంబిత లయయు నడచునప్పుడును (2) ద్రుతమధ్యలయ యిట్లు వచ్చునప్పుడును, (3) ప్రథమమున మధ్యలయ అనంతరము విళంబలయ ఇట్లును, ఈమూఁడిటిని గోపుచ్ఛయతి యని యెఱుఁగవలయు. ఒక్కొక్కలయ, ద్రుతలయ, మధ్యలయ, విళంబలయ యిట్లు ప్రవర్తించునప్పటి మూఁడువిధములు సమయతి యనఁబడును.

శ్లో॥ "ఏక ఏవ లయోయస్యాద్ద్రుతః స్యాత్సమాభిదా ।
ద్రుతాదయః క్రమాదత్ర యతిః స్రోతోవహామతా ।
గోపుచ్ఛా ఇతి విజ్ఞేయా ద్రుతాదీనాం విపర్యయాత్॥"

కాని యతి యాఱువిధములని కొందరి *అభిప్రాయము. (1) స్రోతోవహా (2) గోపుచ్ఛ (3) సమ (4) యావమధ్య (5) వేదమధ్య (6) విషమములని వానిపేర్లు. యవమధ్యనే మృదంగయతి యనియు, వేదమధ్యనే పిపీలికయతియనియు నందురు. మృదంగమువలె తుది యల్పముగను మధ్యయధికముగను గల యంగములు కలది యవమధ్య యతి యనియు, నల్పాంగములు మధ్యను యధికమైనవి తుదియందును కలది వేదమధ్యయతి యనియు నీయైదువిధములచే నిశ్చయింపరానిది విషమయతి యనియు వీరి యభిప్రాయము. ఇవి కాక ఖడ్గయతి, నాగయతి చక్రయతి, పదళయతి మున్నగునవి కల్పించవచ్చునని కోహలుఁడు చెప్పెను. కాని రత్నాకరాది

*ఆంజనేయమతము.

గ్రంథముల వీనిఁ జూడము. కావున సమ, స్రోతోవహా, గోపుచ్ఛయతులు మాత్రము ముఖ్యములని యెంచవలసి యున్నది.

ఈసంగతులవలన యతివిషయమునను యభిప్రాయ భేదములుండిన వనవలసినదె. ఇటీవల యతి అనుద్రుతాది యంగములు తాళమున ప్రవర్తించువిధమును చెప్పునను యభిప్రాయము ప్రబలినది. మరియు సమయతి SSS ఇట్లు సమజాతియంగములు కలది యనియు, స్రోతోవహాయతి నది వలె ◡ O I S క్రమముగా గొప్పయంగములు కలది యనియు, గోపుచ్ఛయతి S I O ◡ క్రమముగా క్షీణించు అంగములు కలదియనియు పిపీలకయతి S I O I S అంత్యములందు గొప్పయంగములు కలదియనియు నిందుకు వ్యతిరేకముగ నంత్యములందు యల్పాంగములు కలది మృదంగయతి యనియు, నియమములేనిది విషమయతియనియు నవీనుల యభిప్రాయము.

10 ప్రస్తారము:—కవిత్వమున గణములను ప్రస్తరించి యనేక వృత్తములు చెప్పునట్లు అనుద్రుతాది యంగములను ప్రస్తరించి పెక్కుతాళములు చెప్పవచ్చును.

శ్లో॥ అథప్రస్తార సంభూతాః ప్రత్యయాస్సంతి విస్మయాః ।
తేషుపంచాంగ సంభూతాప్రస్తారః కథ్యతేధునా॥

కుడినుండి ఎడమకు అధికాంగములనుండి తక్కువ అంగములు చొప్పున ఉండునట్లు పరిస్తరించుట యాచారము. అందుచే నాదిని స్థూలాంగమును చివర అల్పాంగమును ఎంచి దీనిని మహాత్తుగజేసి ప్రస్తరించునది. ఇట్టి ప్రస్తారములు (1) ప్రస్తారము (2) సంఖ్య (3) నష్టము (4) ఉద్దిష్టము (5) పాతాళము (6) దృతమేరువు (7) లఘుమేరువు (8) గురుమేరువు (9) ప్లుతమేరువు (10) సంయోగమేరువు (11) ఖండప్రస్తారము ఇట్లు చెప్పబడెను. ఈ యంశములవలన నెన్ని అంగముల ప్రస్తరించగా పుట్టిన తాళమున నెన్నో తాళమున నెన్నిదృతాద్యంగములు కలవోయను నష్టసంఖ్య నెఱుగుట, ఒక తాళము ప్రస్తారమున నెన్నవదో యను ఉద్దిష్ట సంఖ్య నారయుట, అను దృతాద్యంగము ప్రస్తరించిన తాళము చొప్పున నెన్నియగును అను పాతాళసంఖ్య నెరుగుట, అను దృత ప్రస్తారమందు దృతరహితమైనవియు, ఒకటి, రెండు ఇట్లు దృతములుగల తాళము లెన్నికలవో యను దృతమేరువు ఇట్లు లఘ్వాది మేరువులు లెఖనారయుట తెలియనగును. ఇట్టి ప్రస్తారతాళములు నారదుఁడు శార్ఙ్గదేవుఁడు మున్నగువారు వారివారి మతములుచొప్పున వెలయించిరి. ఇవి ఒకరి మతమునకు మరియొకరి మతమునకు కొంత భేదించియుంట చూతుము. ఆంజనేయ మతమని కొండొకచో మధుతాళం, సుధాకరతాళం, మకరతాళం, ఘనతాళం, శరభతాళం,

నారాయణ ప్రియతాళం, రాజకీర్తితాళం ఇట్లు వర్ణింపఁబడినవి. పై ప్రస్తారములన్నియు వర్ణింపఁబడుటయు పాతాళసంఖ్య అంగముల ప్రస్తారసంఖ్యలు, వీని మేరులెఖలు, మరిప్రస్తార మేరులెఖలు మున్నగునవి విపులముగఁ జెప్పబడుటయు బురాతనగ్రంథములందు చూతుము. ఇవెల్ల చెప్పుట ఇటకూడదు. కావున కొన్ని మేరులెఖల పథకముల నిటజూపుదుము.

## ప్రాచీనోక్తతాళములు.

చచ్చుత్పుట, చాచత్పుట, సంపద్వేష్ట, షట్పతాపుత్రిక, ఉద్ఘట, ఆది, దర్పణ, చర్చరి, సింహలీల, కందర్ప, సింహవిక్రమ, శ్రీరంగ, రతిలీల, ప్రత్యంగ, గజలీల, త్రిభిన్న, వీరవిక్రమ, హంసలీల, వర్ణభిన్న, రంగద్యోత, రాజచూడామణి, రాజ, సింహవిక్రీడిత, వనమాలి, చతురశ్ర, త్రిస్రవర్ణ, మిశ్ర, రంగప్రదీప, హంసనాద, సింహనాద, మల్లికామోద, శరభలీల, రంగాభరణ, తురంగలీల, సింహనందన, జయశ్రీ, విజయానంద, ప్రతి, ద్వితీయ, మకరంద, కీర్తి, విజయ, జయమంగళ, మంఠ్య, రాజవిద్యాధర, జయ, కుడుక్క, నిఃసారక, క్రీడ, త్రిభంగీ, కోకిలప్రియ, బిందుమాలి, సమ, నందన, ఉద్దీక్షణ, మట్టెక, ఝెంక్క, వర్ణమంఠిక, అభినందన, అంతరక్రీడ, మల్ల, దీపక, అనంగ, విషమనందీ, ముకుంద, కుడుక్క, ఏక, పూర్ణకంకాల, ఖండకంకాల, సమకంకాల, విషమకంకాల, చతుస్తాల, దొంబులీ, అభంగ, రాయబంగాల,

లఘుశేఖర, ప్రతాపశేఖర, ఝంగఝంప, చతుర్ముఖ, ఝంప, ప్రతిమంఠ, జార, వసంత, రతి, లలిత, కర్ణయతి, షట్తాల, వర్ధన, వర్ణయతి, రాయనారాయణ, మదన, పార్వతీలోచన, శ్రీనందన, లీల, విలోక, లలితప్రియ, జనత (క), లక్ష్మీశ, రాగవర్ధని, ఉత్సవ తాళములు సంగీతమకరందాది సకల గ్రంథములందు నూతనము, శార్ఙ్గదేవుడు వీనిని పేర్కొనియు మరికొన్ని, హంస, గద, సింహ, కరుణ, సారస, చండ, చంద్రకల, లయ, స్కంద, అష్ట (త). ద్వంద్వం, కులిన్ద, కల ధ్వని, గౌరి, సరస్వతీకంఠాభరణ, భగ్న, రాజమృగాంక తాళములను కల్పించి శాంబోలు చెప్పెను.

"తాళదార్యాయము" అను గ్రంథమున కుంభతాళము, వినాయకతాళము ఇట్టివింత తాళములు చెప్పబడెను. "అభినవ తాళమంజరి"యందు ఏకతాల, దాదర, తేవరా, రూపక, ఝుమాలీ, అంక, ఝంప, శూల, రుద్ర, చౌతాలం, విశ్వ, ధమార, ఝుమ్రి, దీపచందీ, అడ్డచౌతాలం, సవారీ, త్రితాల, విష్ణుతాల, పురాణతాల, శేషతాల, విజయ, గణేశ, శ్రుతి, మాగధ, బ్రహ్మతాళములు పేర్కొనబడుట ప్రాచీన పద్ధతిననుసరించుటకే "అష్టోత్తరశతతాళలక్షణము"నుగ్రంథమున 108 పై తాళములు, వర్ణింపబడినవి. పూర్వపు గ్రంథములందు ఈతాళములందలి యంగములు విపులముగ శ్లోకములచే వర్ణింపబడుటయు వీనియంగగుర్తులతో నివి వెలయింపబడుటయు జూతుము. వానినివర్ణించుటగ్రంథవిస్తరకారణము—

పాతాళసంఖ్య.

| | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| u | o | uo | ı | uı | oı | uoı | s | us | os | uos | ఽ | వృద్ధి. |
| 1 | 2 | 3 | 6 | 10 | 18 | 31 | 56 | 98 | 174 | 306 | 548 | సంఖ్య. |
| 1 | 2 | 5 | 10 | 22 | 44 | 89 | 174 | 142 | 662 | 1270 | 2420 | పాతాళసంఖ్య. |

ఇందలి ఇంటింట ఎన్నిసంఖ్యలున్నవో అన్నిదృతముల తాళసంఖ్య కలదన్ని తెలియవలయు.

దృతమేరువు.

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | | | | ఽ |
| | | | | | | | | | os | uos | 1 |
| | | | | | | | s | us | 1 | 6 | 21 |
| | | | | | oı | uoı | 1 | 5 | 15 | 55 | 75 |
| | | | ı | uı | 1 | 4 | 10 | 20 | 39 | 77 | 144 |
| | o | uo | 1 | 6 | 6 | 10 | 18 | 33 | 58 | 96 | 156 |
| u | 1 | 2 | 3 | 4 | 7 | 12 | 19 | 28 | 44 | 70 | 109 |
| 1 | 1 | 1 | 2 | 3 | 4 | 5 | 8 | 12 | 17 | 23 | 34 |

ఊర్ధ్వపంక్తి క్రమముగ మొదటిది 1 దృతము కలవియు అనంతరమువి 2 దృతములు ఇట్లు 3, 4, 5 దృతములు కల తాళములు ఇండ్లయందలి సంఖ్యచే నెరుగనగును.

లఘుమేరువు.

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | | | | | | | | | | ఽ |
| | | | | | | | s | us | os | uos | 1 |
| | | | ı | uı | oı | uoı | 1 | 3 | 9 | 22 | 51 |
| u | o | uo | 1 | 2 | 5 | 10 | 20 | 38 | 71 | 130 | 237 |
| 1 | 2 | 3 | 5 | 8 | 13 | 21 | 35 | 57 | 94 | 154 | 254 |

పైవిధమున ఊర్ధ్వపంక్తి వెంబడిని లఘువులేనివి 1 లఘువుకలవి 2, 3 ఇట్లు లఘువులు కల తాళములు ఇండ్లసంఖ్య చెప్పును.

u అనుద్రుతము.

# దేశితాళములు; దశప్రాణవివరము.

## ప్రకరణము 3.

ఇంతదనుక పూర్వపు శాస్త్రవేత్తల మతమునను సరించిన తాళలక్షణము నెఱిగియుంటిమి. ఈ యీసంగతు లిప్పటి తాళమున నెంతవరకు ప్రయోజనకరములగుచున్న వియు, నెట్లు యెంచఁబడుచున్నవియు మున్నగు సంగతుల నారయుదము. సంగీతమందలి పెక్కుయంశములు మేళకర్తలు మున్నగువానివలె తాళముగూర్చిన యంశములును దేశమం దంతట నొక్కపద్ధతిగ లేక ఉత్తరహిందూస్థానమున నొకవిధ మునను, కర్ణాటకము లేక దక్షిణమున మరియొకవిధమునను వెలసియుంట విదితము. కాని తాళవిషయమందు లక్ష్యమున రెండుపద్ధతులుగ నున్నను లక్షణమందు వ్యత్యాసమెక్కు డుగ లేదనవలసినదే. కాని తాళముల పేర్లుమాత్రము భిన్న ములుకాని యవి యొక్కటేయనికూడ చూడగలము.

తాళము విరాజిల్లుటకు ముఖ్యమగు కాలాది దశప్రా ణములందు కాల, మార్గ, క్రియ, అంగ, గ్రహ, జాతి, లయ, యతి యనునవిమాత్రము పూర్వమువలె యిప్పుడును గ్రహిం పఁబడుచున్నవనియు, కళాప్రాణము గురువు తాళమునుండి విరమింపఁబడినప్పటినుండియు గానబడుట లేదనియు, ప్రస్తా

రము గణితశాస్త్రానుగుణ్యమగు ప్రావీణ్యమున కాల చాలము తాఘ్రన లక్ష్యమున జోటు లేదనియు నిట్లు తెలియును. కాలాది లక్షణముకూడ పూర్వమందువలె కాక కొంత సంక్షేపింపఁ బడిన దనవలసినదె. ఇందు సులభముగ సంగతులే గ్రహింపఁ బడుచున్నవి. రత్నాకరాది గ్రంథములందలి చచ్చత్పుటము యిత్యాదితాళము లెవ్వియు నిప్పుడు గ్రహింపబడుట లేదు. ఎక్కడనైనను ఒకటిరెండు తాళములకు పోలికలున్నను పేర్లు భిన్నముగనే యున్నవి. ఒకటిరెండుపేర్లు సమములయ్యె నవి యొక్కటిమాత్రము కావు. ఇట్లు పూర్వపుపద్ధతికిని యిప్పటి పద్ధతికిని కొంత వ్యత్యాసము కలదు. కాని పూర్వపు యీ లక్షణమును చెప్పకొని మనము గర్వపడుచునే యున్నాము.

## కా ల ము .

క్షణము మొదలు కళ వరకు చెప్పఁబడిన కాలములి ప్పుడు గ్రహించుటయును వీని ప్రమాణము (value) నార యుటయు సులభముగ లేదు. అనగా నిమిషము (minute) నకుగాని శెకను(second)నకుగాని వీనిఘడియ, విఘడియలకు వలె పోల్చుట కళక్యమనుట. నూరు తామరాకులను సూది తోఁబొడచి యట్లు గ్రహించిన క్షణము మొదలగు కాలము లను శెకనులతోఁ బోల్చి చెప్పవలసియున్నది. మాత్రముగూర్చి యిట్లు కొంతపోల్చి చెప్పియుంటిమి, తక్కినవియు వీనిచే గ్రహిం పవలసియున్నది. అనుద్రుతమును 2 చతుర్భాగకాలమని వే

పొందిరి తెలిసినా యీ కాలములు కొంతవరకు స్పష్టమగుట చూడుడు.

అనుద్రుతము = 2 × 2 = 4 కళ కాలములకుదుల్యము
= 4 × 8 = 32 నిమిష ,, ,,
= 32 × 8 = 256 కాష్ట ,, ,,
= 256 × 8 = 2048 లవ ,, ,,
= 2048 × 8 = 16384 క్షణ ,, ,,

అనగా కళకాలము లఘువునందు $\frac{1}{16}$ వంతున కలదు. దీనినే యాంగ్లేయులు semiquaver అని చెప్పుకొందురు. జర్మనులు sechzehntel అనియు నమెరికనువారు 'sixteenth note' అనియు చెప్పుకొందురు.

షట్కాలములు.

ప్రకృతమున నీకాలములన్నియు వాడుకయందు లేవనుటకన్న లక్ష్యమందు చూపుట దుస్తరమందుము. అనగా మేధావంతులగు ప్రజ్ఞాశాలురకు గ్రాహ్యము కాకపోదని మా యభిప్రాయము. ఉత్తరమున ద్రుత, మధ్య, విళంబితములను త్రికాలములుమాత్రము చెప్పుదురు. ఇట్లే దక్షిణమునను విదితము.

కొంతకాలమునుండి అనగా క్షేత్రజ్ఞుడు, ఆది అప్పయ్య, రామస్వామి దీక్షితులు, ముత్తుస్వామి దీక్షితులు, శ్యామశాస్త్రిగారు, త్యాగరాజు మున్నగు వాగ్గేయుల కాలమునను

త్రికాలములు మాత్రము లక్షింపబడినట్లు తెలియుచున్నది. వీరి కృతములు ముఖ్యముగ క్షేత్రజ్ఞుని పదవర్ణములు మున్నగునవి విళంబితకాలముననే పాడబడినట్లు తెలియును. పదవర్ణములు నాట్యయోగ్యములు—ఆదిఅప్పయ్యగారి "విరిబోణి" వర్ణముసహితము పదవర్ణముగ గన్పట్టుచున్నది. నాట్యయోగ్యములగు యీవర్ణములు విళంబిత కాలముననే పాడబడెడివి. దీక్షితకృతములందు విళంబిత, మధ్యమ కాలములు మాత్రము కందుము. అందుచే రెండుకాలములు పైలాక్షణికులు యంగీకరించినట్లు గ్రహింతుము. ఇటీవలివారు దృతకాలమును గ్రహించి పాడుచుండిరనుట విదితము. అప్పుడు స్వరస్థానములు శుద్ధములుగ నుంట దుస్తరముని యంగీకరింపబడుచున్నది. కాని షట్కాలములను పాడగలుగు ధీశాలులు లేకపోలేదు. త్యాగరాజు కాలమున షట్కాల గోవింద మారార్ అను తిరువాన్కూరు గాయక శిఖామణి షట్కాలములను పాడుచుండెను. ఇతఁడు ఒకానొకప్పుడు త్యాగరాజుగారిని కూడ మెప్పించియుంట విందుము *ఇట్లు పాడుట గారడివిద్యవలె వినోదకరముగ మాత్రము కాన్పించునందురు. ప్రథమమున మొదలిడుకాలము మిగుల విళంబము కలదిగ నుండిన

* గోవింద మారార్ తో వడివేలు యన్నగు తిరువాన్కూరు యాస్థాన గాయక శిఖామణులు నుండిరి. వీరు శ్రీత్యాగరాజుగారిని సందర్శించి తమ ప్రజ్ఞను చూపి త్యాగరాజుగారి మన్ననలకు పాత్రులైరని తెలియును.

కాని షట్కాలములును పాడుటకు వలనుపడదు. సామాన్యముగ ఒక గురువు లేక 8 అక్షరముల నుచ్చరించుటకు వలయు కాలమున బ్రారంభించి తరువాత లఘుకాలము లేక 4 అక్షరముల కాలము, రెండక్షరముల కాలము, ఒకయక్షర కాలము, అర్థాక్షరకాలము, చతుర్థాక్షరకాలము ఇత్యాదివిధమున కాలమును యర్థార్థముగ తగ్గించి పాడుట సులభసాధ్యముకాదు. ఇది మిగుల కష్టమగునని. అందుచే గోవిందమారార్ మిగుల కొనియాడఁబడెను. ఉదాహరణముగ చూడుడు.

| | | |
|---|---|---|
| 1 వ కాలము | †ఆ… … …… | ఆ… … ……… |
| 2 వ కాలము | ఆ……..ఆ….. | ఆ ……..అ…….. |
| 3 వ కాలము | ఆ…ఆ…ఆ…ఆ | అ…అ…అ…అ… |
| 4 వ కాలము | అ అ అ అ అ అ అ అ | అ అ అ అ అ అ అ అ |
| 5 వ కాలము | 16 అ లు | 16 అ లు |
| 6 వ కాలము | 32 అ లు | 32 అ లు |

ఇట్లు మిక్కిలి విళంబకాలము తీసికొనినగాని 6 వ కాలము నొప్పించలేము. దృతకాలముతీసికొని 6 కాలములు నొప్పించుట కష్టతరము.

ఆఙ్గ్లేయుల కాలములు.

పాశ్చాత్యులకును యిట్టి కాలములు కొన్నికలవు. తామస్ డి వాల్సింగుహ్యాము (Thomas de Walsyngham) 14 వ

† ఘాత ; వ్రేళ్ళను కొలిపించుట.

శతాబ్దమున large, long, breve, Semi breve, minim అను అయిదుకాలములను చెప్పెను. ఫ్రాన్సునందు నుయీకాలములు maxima (or duplex longa) longa, brevis Semi-brevis, mimim అను అయిదుకాలములు వాడఁబడెను.

విశ్రాంతిలేక మూర్గప్రాణము (Rests)

ఒక యక్షరమునకును మఱియొక యక్షరమునకు ఇట్లు పదములు, అంగములు మధ్యనుగల విశ్రాంతికాలము గ్రహింపబడునని మనవారు చెప్పియుండిరి. కాలప్రాణము క్షణము మొదలు ప్లుతమువరకు ఎట్లు గ్రహింపనగునో యట్లే మూర్గప్రాణముకూడ అనగ విశ్రాంతికాలములు (Rests) కూడ గ్రహింపనగును. పాశ్చాత్యులు విశ్రాంతికాలము గ్రహించియుండిరి. మరియొకమతమునను సరించిన పన్నెండుమార్గములు చతుర్భాగకాలము మొదలు క్షణమువరకు గల కాలములతో దుల్యములని గ్రహించునది. చతుర్భాగకాలము=చతుర్భాగమార్గము, కళకాలము=త్రుటి, నిమిషము=అనుత్రుటి, కాష్టము=ఘర్షము, లవకాలము=అనుఘర్షము, క్షణము=స్వరము.

విరామాంతములు (Dotted notes) :—పై విధముగు విశ్రాంతికాలములు చెప్పునప్పుడు పాశ్చాత్యులు $3\frac{1}{2}$, $1\frac{3}{4}$, $\frac{7}{8}$, $\frac{3}{4}$ ఇత్యాదులను తమప్రజ్ఞను వెల్లడించుటకు చెప్పిరి. మన వారు వీనిని గ్రహింపకపోలేదు. వారు చుక్కలగుర్తులతో చెప్పుతరి మనవారు విరామాంతములుగ జెప్పిరి. స్వరము

తరువాత చుక్కపెట్టిన స్వరమునందలి యర్ధకాలమును, రెండు చుక్కలు ముప్పాతిక కాలము ఇట్లు కలిగియుండును. 2 చుక్కలుగల 'మినిమ్' 'క్రాచట్' 'క్వివర్'కు తుల్యము d.. = d d d తక్కినవియు నిట్లు గ్రహింపనగును. విరామమును మనవారిప్పుడు స్వరము ప్రక్క కామా వేసి 'స,' ఇట్లు చెప్పుచున్నారు. కాని పాశ్చాత్యులవలె చుక్కలు (dots) తో చెప్పుటభావ్యమని మామతము. పైయంశముల నిట చూడుము.

ప్రాక్పాశ్చాత్యుల యొక్క కాలముల పట్టకము.

| కాలముల పేర్లు. | అక్షరకాలము | మాత్రలు | మార్గము. | స్వరములు. | పాశ్చాత్యులయొక్క కాలములు. | పాశ్చాత్యులయొక్క విశ్రాంతి Rests |
|---|---|---|---|---|---|---|
| కాకపాదం | 16 | 4 | వార్తికము | సరిగమ 12. | Semi Brevi | |
| ప్లుతము | 12 | 3 | * | సరిగమ 8. | | ■. |
| గురువు | 8 | 2 | చిత్రము | సరిగమ .... | Minim | ■ |
| లఘువు | 4 | 1 | చిత్రతరము | సరిగమ | Crotchet | 1 |
| ద్రుతము | 2 | $\frac{1}{2}$ | చిత్రతమము | సరి | Quaver | 7 |
| అనుద్రుతం | 1 | $\frac{1}{4}$ | అతిచిత్రతమము | స | semiquaver | F |
| చతుర్భాగం | $\frac{1}{2}$ | $\frac{1}{8}$ | | $\bar{స}$ | Demi-Semi Quaver | |
| కళ | $\frac{1}{4}$ | $\frac{1}{16}$ | | $\bar{\bar{స}}$ | Semi Demi semiquaver | |

తక్కిన బేసి (odd) యక్షరములను అనగా 3 ద్రుతానుద్రుత విరామమనియు 7 లఘుద్రుతానుద్రుత విరామమనియు

* ప్లుతమునకు తుల్యమగు మార్గము మనవారు చెప్పలేదు. వార్తిక మిందుకు తుల్యము కాదు. కాకపాదమే వార్తికమునకు తుల్యము. ఇది లక్ష్యమున గానము——

6 లఘుద్రుత విరామమనియు నిట్లు ఎంచవచ్చును. మరియు $\frac{1}{4}$ అక్షరమును చతుర్భాగకళ విరామము, $1\frac{1}{4}$ అనుద్రుత చతుర్భాగకళావిరామము, $3\frac{1}{4}$ ద్రుతానుద్రుత చతుర్భాగము ఇట్లు ఎంచవచ్చును.

లయ లేక గతి (speed) :—హిందువులు మూడువిధములగు లయ వాడుచుండిరని చెప్పితిమికద. ఈగతి (speed) ననుసరించి మాత్ర మారుచుండునని తెలియుదుము. మధ్యగతి యందుండినమాత్ర విళంబగతియందు రెట్టింపువిలువయు, ద్రుతగతియందర్ధవిలువయు గలిగియుండును. ఉదాహరణముగ అనుధృతము మధ్యగతియందుండినదనియెంచిన విళంబితమందది ద్రుతకాలమును, ద్రుతగతియందు చతుర్భాగకాలము కలదిగ నగును. ఇట్లు మధ్యలయయందలి లఘువు విళంబితమున గురువు, ద్రుతగతియందు ద్రుతము నగును. పాశ్చాత్యుల క్రాచట్ d విళంబమున మినిమ్ d ద్రుతమున క్వావర్ d అగును. ఈగతి చూపుటకు మనవారేమి పాశ్చాత్యులేమి స్వరములపై గీతలు వేయుచున్నారు. లఘువు సరిగమ విళంబితమైన (Adogio) $\overline{\text{సరిగమ}}$ మధ్యకాలము (Moderato) కలదిగను, $\overline{\overline{\text{సరిగమ}}}$ ద్రుతకాలము (Allegro) కలదిగను ఎంచుదుము. $\overline{\text{సారిగామా}}$=సరిగమ ఇట్లు తక్కినవి తెలియవలయును.

అక్షరసంకలనము:—ఈవిధమున స్వరములను చేర్చి వానిపైన గీతలువేసి గతులను చూపునట్లు అక్షరములను లేక స్వరములను ఒకయంగమున సంకలనముచేసి చెప్పుదురు. స స=సా; సా స=$2\frac{1}{2}$ అక్షరకాలము; స స=$1\frac{1}{4}$ అక్షరకాలము; స స=$1\frac{1}{8}$ అక్షరములును; స స=ఒకఅక్షరము ఇట్లు ఎంచవచ్చును. కొన్ని కాలగతుల నిటుచూడుడు.

| | | | | |
|---|---|---|---|---|
| (1) ససస | 3 | అక్షరములు | $\frac{2}{3}$ | మాత్ర. |
| (2) సాసా | 2 | ,, ,, | $\frac{1}{2}$ | ,, |
| (3) సాసాసా | 3 | ,, ,, | $\frac{1}{3}$ | ,, |
| (4) సాసాసాసా | 4 | ,, ,, | $\frac{1}{4}$ | ,, |
| (5) సాసాసాసాసా | 5 | ,, ,, | $\frac{1}{5}$ | ,, |
| (6) సాసాసాసాసాసా | 6 | ,, ,, | $\frac{1}{6}$ | ,, |
| (7) సాసాసాసాసాసాసా | 7 | ,, ,, | $\frac{1}{7}$ | ,, |
| (8) సాసాసాసాసాసాసాసా | 8 | ,, ,, | $\frac{1}{8}$ | ,, |
| (9) సాసాసాసాసాసాసాసాసా | 9 | ,, ,, | $\frac{1}{9}$ | ,, |

ఈగీతలందలి స్వరములను గమకములతో చేర్చి పాడుటయు నిర్వియంతమగునప్పుడు తాళక్రియ సరిపోవుటయు దటస్థించును. ఇందుచే గ్రొత్తగీటున తిరిగి క్రియప్రారంభించును.

క్రియ.

పూర్వపువాగ్గేయులు చెప్పిన ద్రుతము,లఘువు మున్నగుయంగములను కొలిపించుటకు ద్రుపకాదులన్నియు వాడఁ

బడుట లేదని యెంచితిమి కద. ఘాతతో మొదలుపెట్టి వరుసగ చిటికెన వ్రేలు మొదలగు వ్రేళ్ళతో నాయా జాతియంగమును క్రియతో చెప్పఁబడుట విదితము. అనగా మనవారు అంగములను ఆవాపమను నిశ్శబ్దక్రియచే గాని, ద్రువకమను సశబ్దక్రియతో గాని యొప్పించుచున్నారు. ద్రుతమును తాళము అనుసశబ్దమార్గక్రియతోను, కృష్య అను నిశ్శబ్దదేశిక్రియతోను చెప్పుదురు. మిగిలిన క్రియలు కొందఱిచే వాడఁబడినను యివియే ప్రబలినవి. ఆదితాళము చూడుడు.

| 1 లఘువు. ద్రువకక్రియ. | | | | O ద్రుతము. | | O ద్రుతము. | |
|---|---|---|---|---|---|---|---|
| | | | | తాళం | కృష్య | తాళం | కృష్య |
| ఘాత | చిటికిన వ్రేలి ఘాత | పవిత్ర వ్రేలి ఘాత | మధ్య వ్రేలి ఘాత | ఘాత | విద లింపు | ఘాత | విద. లింపు |
| స | రి | గ | మ | ప | ద | ని | స |

## తాళములు.

కొంతకాలమునుండి ద్రుతలఘువులు మాత్రము విరివిగా నీదక్షిణదేశపు గానమున వాడఁబడుచున్నవి. అనుద్రుతము దక్షిణదేశపు ఝంపెతాళమునకలదు కాని ఉత్తరమున నిది ఇప్పుడును, విరామముగ జెప్పబడుచున్నది. ఈరెండు విధముల యంగములను పరిస్తరించి మనవారు సప్త తాళములను చెప్పుచుండిరి. ఇట్లు దక్షిణమున ద్రువతాళము,

మఠ్య, రూపకము, ఝంపె, త్రిపుట, అట, ఏక తాళము లను నవి ప్రసిద్ధములాయెను. ఉత్తరమునను యీవిధమగు తాళములు కలవు. కాని వేర్వే భిన్నముగ నేయున్నవి. వీనివివరములు ముందుచూతుము. దక్షిణదేశపు సప్తతాళముల ప్రశంస తాళాధ్యాయము *అను పుస్తకమున చెప్పబడినది. ఇందు విరామాంతమగు యంగములు చెప్పంబడుట చూతుము. గురువు చెప్పబడుటకు కారణము ప్రాకృతపు పద్ధతి కొంతనిలుపుటయే. దీనిని ప్రకృతమున రెండులఘువులుగ నెంచుదుము. ఈపుస్తకము కొన్ని శతాబ్దములకు నెరుకటిదియని నెంచవలసియున్నది. అట్లులయ్యు సప్తతాళములనే చెప్పుటచే నిప్పటి పద్ధతికిది పునాదిగ గన్పట్టుచుండును. ఈతాళములిట్లు చెప్పంబడెను.

శ్లో॥ "ధ్రువో మఠ్యో రూపకశ్చ ఝంపా త్రిపుట ఏవచ।
అటతాళైకతాళశ్చ సప్త తాళాః ప్రకీర్తితాః॥
ధ్రువతాళే లఘుః కార్యః స్తత్రశ్చైకో గురుర్ద్రుతః।
మఠ్యతాళే క్రమేణైవ జగణశ్చ ప్రకీర్తితః॥
ద్రుతమేకో లఘుశ్చైవ రూపకేచ ప్రకీర్తితః।
ఝంపె తాళే విరామాంతం ద్రుతమేకో లఘుస్తథా।
త్రిపుటస్త్రివిధః ప్రోక్తో విరామాంత్యం ద్రుతత్రయం।
అటతాళే లఘుద్వంద్వం ద్రుతద్వంద్వంచ కీర్తితం।
ఏకేనైవ ద్రుతేనస్యాత్ యేకతాళ మితీరితం॥

* ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమునందు 12995-7 నెంబరున నున్నది.

ఈ తాళములకు మంత్రాదులకువలె ఛందస్సు చెప్పఁబడెను.

### ధ్రువతాళ స్వరూపం.

"భానువారే పుష్యబుక్షే ధ్రువతాళస్సముద్భవేత్ ।
పీతవర్ణో విశాలాక్షో హారమాలావిశోభితః ।
శుభ్రవస్త్ర కృతశ్చైవ కౌండిన్యశ్చ ఋషిస్స్వయం ।
శృంగారశ్చ రసో నుష్టుప్ ఛందోబ్రహ్మతు దేవతా ।
అయంజంబూద్వీపవాసీ లఘుర్ద్వౌచే గురు స్తథా ।
ఇదంలోక హితార్థాయ భరతాజ్ఞా ప్రయుజ్యతే॥"

ఇట్లు మిగిలిన తాళములును చెప్పఁబడెను.

మఠ్యసోమవారము హస్తనక్షత్రంజన్మ శ్యామవర్ణం భారద్వాజ ఋషి ప్లక్షద్వీపనివాసం మహేశ్వర ఛందస్సు॥

రూపకము మంగళవారము, మఖనక్షత్రంజన్మ, రక్తవర్ణం, వశిష్టఋషి కరుణరసం శాల్మలి ద్వీపనివాసం. ఝంప బుధవారము పుష్యమినక్షత్రం జన్మ హరిద్రవర్ణం జమదగ్ని ఋషి హాస్యరసం కుశద్వీపనివాసం వైష్ణవీఛందస్సు. త్రిపుట గురువారము జన్మ శ్వేతవర్ణం కాశ్యపఋషి భీభత్సరసం క్రౌంచద్వీప నివాసం కౌమారిఛందస్సు. అట శుక్రవారము హస్తనక్షత్రం జన్మ హిరణ్యవర్ణం ఆత్రేయఋషి అద్భుతరసం శాకద్వీపనివాసం. మహేంద్రి ఛందస్సు. ఏకతాళం శనివారము జ్యేష్ఠనక్షత్రంజన్మ శ్యామ వర్ణం దూర్వాసఋషి భయానకరసం పుష్కరద్వీపం చాముండి ఛందస్సు.

### ప్రమాణము (Unit)

పూర్వమునుండియు మాత్రప్రమాణముగ నెంచబడుచుండెను. ఇయ్యది చతురక్షరోచ్చారకాలము కలదిగ నెంచిన లఘువుకు తుల్యముగ నెంచబడెనుకద. కాని కొందరు మాత్రయన నొక్క యక్షరముఁగ నెంచుట శోచనీయము.

లఘువు పూర్వము మాత్రకు తుల్యమై 'అవినాశి'గ నుండెను. కాని ఇటీవల 'వినాశి'యై త్రిశ్రాది జాతిభేదములను చెందునది గనుంటచే నది ప్రమాణముగ నెంచబడదు. ప్రమాణము మారునది కాదు. అంగుళము మారదుకద. ఇందుచే మాత్రయే ప్రమాణముగ నెంచవలసియున్నది.

## గురుప్లుతములు.

పూర్వమున లఘువు 'అవినాశి'గ గ్రహింపబడుతరి గురుప్లుతములతోగల పెక్కు తాళము లా కాలమున విదితము. గురుప్లుతములందలి ప్రథమక్రియయనంతరమున నిశ్శబ్దకములు కలవు. ఈసంగతి ననుసరించి కాంబోలు లఘువు జాతిభేదములు చెందునదిగ నెంచి గురుప్లుతములకు గొంతతుల్యముగ మిశ్రసంకీర్ణజాతులను గ్రహించిరి. మరియు లఘువు మధ్యగతిగ (moderato) నెంచిన విళంబగతియందది గురుకాలము కలదిగను, ద్రుతగతి (Allegro) యందది ద్రుతకాలము కలదిగను పైవిధమున గ్రహింతుము. ఇట్లు గురుప్లుతకాలములు కనుచుందుము. కాని వానిని తాళములందు చెప్పుకున్నాము.

సూళాదితాళములు:—లఘువు మార్పుచెందునప్పటినుండియు నీసప్తతాళములు వినాశిలఘువు ననుసరించి త్రిశ్రాదిభేదములను పొంది ౩౫ తాళములగుచున్నవి. ద్రుతము మార్పుచెందనిది యనునది మరువకూడదు. ముప్పది యైదు తాళములందలి యంగములు వీనియందలి యక్షరసంఖ్యలంగ్లేయుల తాళములు ఈ పథకమందు చూడనగును.

# సూళాదితాళపథకము.

| తాళము. | అంగము గుర్తులు | త్రిశ్ర | | చతురశ్ర | | మిశ్ర | | ఖండ | | సంకీర్ణము | | ఆంగ్లేయుల | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | సంఖ్య | పేరు | సంఖ్య | పేరు | సంఖ్య | పేరు | సంఖ్య | పేరు | సంఖ్య | పేరు | పేరు | గుర్తులు |
| ధ్రువ | 1011 | 11 | మణి | 14 | శ్రీకర | 23 | పూర్ణ | 17 | ప్రమాణ | 29 | భువన | | odoo |
| మఠ్య | 101 | 8 | సార | 10 | సమ | 16 | ఉదీర్ణ | 12 | ఉదయ | 20 | రావ | | odo |
| రూపకం | 01 | 5 | చక్ర | 6 | పత్తి | 9 | కుల | 7 | రాజ | 11 | బిందు | Iamb | do |
| ఝంపె | I◡O | 6 | కదంబ | 7 | మధుర | 10 | కుర | 8 | చణ | 12 | కద | cyclicaldactyl | odd |
| త్రిపుట | 100 | 7 | శం | 8 | ఆది | 11 | లీల | 9 | దుష్కర | 13 | భోగ | Dactyl | odd |
| అట | 1100 | 10 | గుప్త | 14 | లేఖ | 18 | లోయ | 14 | విదళి | 22 | ధీర | Ionicus a majore | oodd |
| ఏక | 1 | 3 | సుధ | 4 | మాన | 7 | రాగ | 5 | రతి | 9 | వసు | | O |

ఆంగ్లేయులు త్రిశ్రాది లఘుభేదములతోఁగల తాళము లన్నియు గ్రహింపకున్నను, 5 అక్షరములు 7 అక్షరములు మున్నగు బేసియక్షర తాళములను పూర్వము గ్రీకులు గ్రహించిరి. అబ్డిఁ కిలియయున్నదొరగారు "Thus the Greeks were very fond of 5-time rhythem, a thing so rare in our music that it is passed over in instruction books as non-existent." అని గ్రీకుల 5 అక్షరముల తాళము తాము వాడకుంట గూర్చి విచారించిరి.

జాతులను క్రియులచే గొలిపించుట:—లఘువునందు ధ్రువకయు ద్రుతమున తాళము క్రమలు వాడుదుము. త్రిశ్ర లఘు వట్లు ఘాత అనంతరము 2 వ్రేళ్లు, చతురశ్ర అట్లు 3 వ్రేళ్లు, ఖండ 4 వ్రేళ్లు, మిశ్ర 6 వ్రేళ్లు, సంకీర్ణ 8 వ్రేళ్లను లెఖించునది.

కర్ణాటక తాళముల ప్రాబల్యత:—మన కర్ణాటకగానమున 35 తాళములు వాడబడక ఆది మొదలగు పేర్లతో గొన్ని మాత్రము వాడబడుచున్నవి. సప్తతాళములందు త్రిపుట (త్రిశ్రజాతి) అటతాళము (ఖండజాతి) ఏకతాళము (చతురశ్ర జాతి) ధ్రువ (చతురశ్ర) మఠ్య (చతురశ్ర) రూపకము (చతురశ్ర) ఝంపె (మిశ్ర) ఆది (చతురశ్ర త్రిపుట) చాపు (మిశ్ర ఏక) ఈతాళములు ఈ జాతులతో మాత్రము విరివిగా వాడుచున్నాము. సప్తతాళములైనను కీర్తనము

లందు బాహుళ్యముగా కానరాక పిసుగుగోలుపునట్లు ఆది, త్రిపుట, రూపక, ఝంపె, చాపు, తాళములు కీర్తనాదు లందు చూతుము. వర్ణము, గీతములు, అట ధృవాదితాళ ములందు కలవు. దీక్షితసోదరులు మున్నగు కొలది వాగ్గే యులు ధృవ, మఠ్య, అట మున్నగుతాళములందు కీర్తనము లను వెలయించియుంట విదితము. అటతాళ మొకప్పుడు కరము యాదరణీయమైయుండెను. తీర్థనారాయణయతీంద్రుల తరంగములం దీతాళము బాహుళ్యముగా వాడబడెను. ఎట్లై నను 35 తాళములు ఇప్పుడు సుగ్రాహ్యములే. పై సూళాది సప్తతాళములును, ఝూంపట రగణ మఠ్యములుతక్క తక్కిన తాళములు గీతములందు చేర్పతగవని వెంకటముఖి చెప్పెను. లక్ష్యమున నీసంగతి ధృవమే.

## ఆదిచాపుతాళములు.

చతురశ్ర త్రిపుట ఆదితాళముపేరను, మిశ్ర లేక ఖండజాతి ఏకతాళము చాపుతాళముపేరను వ్యవహరిం తుము. ఆదితాళము 2 శతాబ్దములనుండి ఝూంపటతాళమని చెప్పబడుచుండెను.

## మధ్యాది, దేశాదితాళములు.

ఆదితాళక్రియను ఒప్పించు క్రమమువలన యీభేదము కలిగియుండును. 2 వ అక్షరమున ఘాతవచ్చి యీక్రమమున క్రియ నడచిన నది మధ్యాదియనియు, నిట్లు మూడవయక్షర

మునుండి ఘాతతో క్రియ నడచిన నది దేశాది యనియు నిట్లు గ్రహింతుము. ఉదాహరణముగ త్యాగరాజుగారి మధ్యాది కీర్తన "రామనీయెడ", "విధులకు మ్రొక్కెద," దేశాదికీర్తనములు "మరియాదగాదయా" "తెలియలేరురామ" "నెనరుంచరా" మున్నగునవి చూడనగును.

ధృవరూపకము.

కొన్ని గీతములు ధృవరూపకము, రూపకధృవములుగ కనబడుచున్నవి. ఇవియు క్రియ నొప్పించు భేదమువలన కలిగినవి. మొదట 3 ఘాతలువేసి విసరి తిరిగి ఘాత ధృవఖండమందు* వేసి విసరి తిరిగి విసరుయందు ఉద్గ్రాహఖండము వచ్చునట్లు వేసి అప్పటి అభోగఖండారంభమున 3 ఘాతలు వేసి విసరి తోడనే ఒక ఘాత, విసరు, 2 ఘాతలు ఇట్లు వేసి ఖండాంతమున విసరు వెనుక ధృవఖండమును యిట్లు గల గీతము ధృవరూపకమగును. రూపకధృవమందు అంతరమున 3 ఘాతలు వేసి విసరి తిరిగి ఘాత వేసి విసరి తిరిగి వచ్చు ఘాతయందు ధృవము వచ్చునట్లు కొలిపించుట యాచారము. కొన్నిగీతములు దృతములతో రంజనకై ప్రారంభింపబడుచున్నవి.

లఘుశేఖరము.

ఇయ్యది 6 అక్షరముల కాలముకలది. అనగా 1 చతురశ్రలఘువు 1 దృతమువీనితో చేరియున్నదందుము. ఇది ధృవ

---

* ధృవము గీతాదులందు ధాతుమాతువులతో చేరిన ప్రథమఖండము. ఇట్టివి రెండుకలిగినది ఉద్గ్రాహఖండమందురు.

తాళమునగలదు. ధృవతాళము 1 లఘుశేఖరము 2 చతురశ్ర లఘువులు కలదిగ కొలిపింతురు. వెంకటముఖి దీని చేర్కొను టకు కారణము వీణెయందు ధృవతాళము తెలుపుచు నిందలి లఘుదృతములకు ఒక్కమీటును తక్కిన వానికి 2 మీట్లును యిట్లు చెప్పు నాచారము ననుసరించియే. ధృవతాళ మిట్లు వేయుట యాచారము.

ప్రాచీన తాళములతో నవీనతాళముల పోలిక.

ప్రాచీనకాలమునందలి లక్ష్యసంగీతము గూర్చి తెలియు టకు శ్రీజయదేవకవి యష్టపదులే లక్ష్యములు. శార్ఙ్గదేవాది వాగ్గేయులు చెప్పినట్టి నిస్సార, యతి, ఏక, రూపక, అష్ట తాళములు ఆయాయష్టపదులందు చూతుము. కాని ఈచా ప్పున నివి పాడబడుటయు లేదు. అందుచే పూర్వపుతాళముల గూర్చి తెలియలేము. కాని వాని యంగములగుర్తుల ననుస రించి కొంత యెరుగవచ్చును. ఇప్పటి మన త్రిపుటతాళము పూర్వపు ప్రతితాళముగను, అట, వర్ణయతితాళముగను, రూపకము యతిలఘ్నముగ పోల్చవచ్చును. మన ధృవ, ఝంప తాళములు పూర్వపువానియందు కానము. పూర్వపు ఏకతా ళము దృతాంగము కలది. కాని ఇప్పు డిది 1 లఘువునుకలిగి యున్నది. పూర్వపు తురంగలీల, ద్వితీయా, ప్రతితాళములు భిన్నములు కావు. ఇవి మన త్రిపుటకు తుల్యములు. ఇట్లు కుడుక్క, వర్ణయతి, *మదన, తాళములు భిన్నములు కాక

* ఇందలిగురువు = 2 లఘువులు కావున,

మన అటతాళమునకు సరిపోవును. ప్రాచీనతాళములందు ఆది, ఏక, మంఠ్య, అట, తాళములను చూతుము కాని అవి మన యీ పేర్లతాళములకు తుల్యములు కావు. పూర్వపు ఆది తాళము 1 లఘువునే కలిగియున్నది. ఇట్లు మంఠ్య IIS కలిగి యున్నది. మన మంఠ్యతాళమునకు శార్ఙ్గదేవుని అడ్డతాళము తుల్యము. తక్కిన ప్రాచీనతాళములు గురుప్లుతయుతములు.

## ప్రస్తారము.

పూర్వపు గ్రామరాగకాలమందలి తాళము లేమి అనంతరము 35 తాళము లేమి దృతాదియంగముల ప్రస్తారమువలన నిర్మింపబడినవికదా. ఇవి క్రమముగా నన్ని యంగముల ప్రస్తారము చొప్పున చెప్పబడెనా యని యెంచునపుడు అట్లు లేవన వలసినదే. ప్రస్తారక్రమమును బాగుగా చెప్పిన శార్ఙ్గదేవాది వాగ్గేయులు తమ మతముల చొప్పున గొన్నిటి (108 లేక 120) మాత్రము చెప్పియుంట శోచనీయము. వీరి తాళములు పెక్కులు 4 మరి 5, కొన్ని 17 అంగములు కూడా కలిగి యున్నవి. ఇప్పటి 35 తాళములను లఘు దృతముల ప్రసార క్రమమున లేవని చెప్పబడును. పెక్కుతాళము లింకను అంగములను ప్రస్తరించి గ్రహింపవచ్చునని చెప్పబడుచున్నది. అనుదృతము ఒకతాళముననే చెప్పబడుట శోచనీయము. మన కొన్ని తాళములు 4 అంగములుగలవైనను అన్ని ప్రస్తారముల సంజాతములైయుండక IOII, IIUO ఈ తాళము లే కలవు. తక్కినవియు విచారణీయములు.

## హిందూస్తానీతాళములు.

ఉత్తర దక్షిణదేశములందలి తాళముల పేర్లు భిన్నములయ్యు పద్ధతి యొక్కటేయనునది మరువకూడదు. ఇప్పుడు 17 తాళములు మాత్రము ఉత్తరమున వాడుచున్నారు. మన చతురశ్ర ఏకతాళమునకు తుల్యముగా ఉత్తరమున ఏకతాళ్ లేక దాద్ర; సంకీర్ణజాతి ఏకతాళమును బోలునవి 2.4.3=9 అక్షరములుగల మధ్యమావతి; 2.3.4=9 అక్షరములుగల మట్టాతాళ్; 4.2.3=9 అక్షరములుగల ఖట్టాతాళ్ ఇట్లు మూడును; త్రిశ్రరూపకమును బోలు 2.3=5 అక్షరముల రూపక్; చతురశ్రరూపకమును బోలు 2.4=6 అక్షరములుగల రూపక్; మన రెండు త్రిశ్ర రూపములకు తుల్యమగు 2.3.2.3=10 అక్షరములుగల ఝంప లేక ఝప్; త్రిపుటకు సమమగు 3.2.2=7 అక్షరముల తేవ్ర; ఆదితాళమునకు సమమగు 4.2.2=8 అక్షరముల త్రితాల్ లేక తిన్ తాళ్; చతురశ్ర మఠ్యకు తుల్యమగు 2.4.4=10 అక్షరములుగల సుర్ ఫక్తా; మరి 4.2.4=10 అక్షరములుగల మంట్; చతురశ్ర ధృవకు తుల్యమగు 4.2.4.4=14 లేక 2.4.4.4=14 అక్షరములుగల అడ్డాచౌతాళ్; త్రిశ్రఅటకు సమముగ 3.3.2.2=10 అక్షరములు గల ఝంప; చతురశ్ర అటకు సమమగు 4.4.2.2=12 అక్షరములుగలచౌతాళ్; ఖండ అటకు సమమగు 5.5.2.2=14 అక్షరములుగల ధామర్ ఇట్టి తాళములను

చూతుము. ఝామర్ తాళము అక్షరములందు ఘాతలు వచ్చు క్రమము ననుసరించి 1.4.11 ఇట్లు అక్షరములుగల దీపచందీ, జుమ్రా తాళములు కొందఱు చెప్పిరి. 1.5.9.13.14 అక్షరములు చొ॥గల సవారితాళము కొన్నిచోట్ల చూతుము. ఈ విధమున మనవానికి తుల్యములుగ నెంచిన కొన్ని తాళములు వారు వేరువిధమున ఘాతలతో నెంచినను యంగములు వేరు కావు. చతురశ్ర, త్రిశ్రలు ఒక్క తాళమున గొలిపించుటయు విదితము. ఇట్లు రెండుజాతులు మనము ఒక్కతాళమున నెంచుట లేదు. రెండావృతములు చొప్పునగల త్రిశ్రరూపకము ఒక్క ఆవృతమున లెఖింపఁబడుటయు జూతుము. మధ్యమావతి లేక కేర్వా తాళము సవార దీపచందీతాళములు 14 అక్షరములుగల అటతాళముకు తుల్యములయ్యు ఘాతలు వేసి కొలిపించుటలో భిన్నములుగనుంటచే నాతాళములు మనము గ్రహించ లేము. ఈతాళములందు క్రియ కొలిపించు విధము కర్ణాటకపద్ధతికి కొంత భిన్నముగ నున్నదంటిమి. తేవ్రతాళము రెండావృతములను కలపి వారు 3 . 2 . 2 / 3 . 2 . 2

ఘాత ఘాత ఖాలీ ఘాత

ఇట్లు చెప్పుదురు. సుర్‌ఫక్తా ఒక్కావృతమున 4 . 2 . 4

*1 0 2 3 0

---

* 1, 2, 3 ఘాతలు; 0 ఖాలీ.

ఇట్లు 3 ఘాతలు 2 ఖాలీలుగ వేయుదురు. ఇట్లు చౌతాళ్
4 . 4 . 2 . 2 విధమునను అడ్డాచౌతాళ్ 2 . 4 . 4 . 4
1 0 2 0 3 0 4 1 2 0 3 0 4 0
విధమునను కొలిపింతురు. ఇట్లు తక్కినవి చూతుము.

ఆవృతములు, విభాగములు. (Bars.)

భారతీయపాటలు యావృతయుతములు. రెండు లేక నాలుగు విభాగములు చేరి యావృతములగును. పాశ్చాత్యులకు నీవిభాగములు కలవు కాని వారు మనవారివలె తాళాంగములందలి యక్షరసంఖ్య, సంకలనము (add) చేయక హెచ్చు చేయుదురు. మనవారి యావృతములందలి తాళకాలము మారునదికాదు. విభాగాంతములను 'తాళి' అను స్వల్పఒత్తు (medium accent) తోను లేక 'ఖాళీ' అను యల్పఒత్తు (weak accent) తోను చెప్పవచ్చును. ఆవృతాంతము అధిక ఒత్తు (strong accent) తో చెప్పుదురు. వీనిని చూపుటకు మనవారు కూడ నిలువుగీతల నుపయోగింతురు. ఆవృతాంతము ǁ లఘువాది విభాగాంతము | ఇట్లు చూపుదురు. కాని లఘువు, దృతములను వేరుగ చూపునట్లు లఘ్వంతమును ⁝ (స్వల్పఒత్తు), దృతాంతమును: (అల్పవత్తు) ఇట్లు చూపిన సుకరమని మాతలంపు. ఇప్పుడు తాళము అద్దమువలె కంటికి గట్టును. మరియు ⁝ǁ లేక ǁ⁝ ఇట్లు వేసిన చుక్కలవైపుగల యావృతము తిరిగి పాడవలయున్నని తెలియనగును. గీతలపై

యాావృతము లంతమొంది ఘాత వచ్చుటచే నివి సమగ్రహము ను తెలుపుననియు అనాగతగ్రహమునందలి యాావృతములట్లు అంత మొందవనియు గ్రహించునది.

ఎడుపుకాలము.

కీర్తనాదులు తాళముతో నడచునప్పటి 3 విధముల గ్రహమున ననాగతగ్రహకాలము ఎడుపుకాలముగ దక్షిణ మున నెంచబడెను. ఇయ్యది 1, 2 ఇట్లు అక్షరకాలము చొప్పున వెలయించి పాడుట విదితము.

గీతములందలి విభాగములు.

గీతములు ఇప్పటి పల్లవనుపల్లవిచరణములను బోలు ధ్రువము, ఉద్గ్రాహము, అభోగములను ఖండములు కలిగి యున్నవి. కొన్ని ఉద్గ్రాహ అభోగఖండములు మాత్రము కలి గియున్నవి. గీతము యొ మొదటిది ఉద్గ్రాహఖండము, ఉద్గ్రాహ ఖండమందలి స్వరములుకన్న అభోగఖండమందలి స్వరములు ఉచ్చస్వనమును కలిగియున్నవి. ఉద్గ్రాహఖండ మనంతరము ధృవముకలదు. కొందఱు ముద్రాఖండము కూడ కలదం దురు. దభోగఖండమందు అంతరిపమ్మట యీముద్రాఖండము కలుగునని చెప్పుదురు. ముద్రాఖండ ధాతువులు ఉద్గ్రాహ ఖండధాతువులవలె నుంటచే లక్ష్యమున నెంచఁబడుట లేదని సుబ్బరామదీక్షితులు చెప్పియున్నారు. కీర్తనములు: అనంతరము కీర్తనములు వర్ణములు స్వరజతులు మున్నగువానియం దీవిధ

మగు ఖండములు వాడబడినట్లు కానము. వీనియందు పల్లవనుపల్లవి చరణము లను పేర్లు చూతుము. కాని ఉత్తరదేశమున ప్రాచీనపద్ధతి ననుసరించున ట్లెంచుటకు కాఁబోలు అస్థాయి, అంతర, అభోగ, సంచారి* యను ఖండములు దృపదాది† కృతములందు చూతుము. ఈ ఖండముల నిట్లు ఎంచుట తాళావృతములను గుర్తెరుగుటకే. పల్లవియం దెన్ని తాళావృతములు కలవో అనుపల్లవియందు నన్నియుండును. చరణములందు వీని రెండింటియం దెన్నియావృతములు కలవో యన్నియుండును. సామాన్యముగ పల్లవియందు రెండావృతములు లేక 4 ఇట్లుండును. బేసిసంఖ్య యావృతములు గలపాదములు కృతులు మున్నగు వానియందు కానము. కీర్తనములందలి చరణములు ఒకటి లేక అంతకుపైగా కూడ నుండవచ్చును. వీనియందలి తాళావృతములు ప్రథమచరణమందలి వానిబోలు.

---

* 'సంచారి' దక్షిణమున వేరు యర్థముతో నుపయోగింతురు.

† దృపద మన పల్లవి పాటను బోలును.

# శ బ్ద ము లు.

---:o:---

ప్రకరణము 4.

ఇదివరలో మనము నేర్చిన తాళమును శబ్దములతో గొలిపించుట నిట చూడగలము. శబ్దములను రమ్యముగను సాకల్యముగను నొప్పించ గల చర్మవాద్యములలో మృదంగము ముఖ్యము. దీనిని "మర్దిల" అనియు చెప్పుదురు. ఈయది పూర్వకాలమునుండియు నీదేశమున ప్రబలినట్లు చరిత్రలు, శాసనములు మున్నగువానివలన తెలియుచున్నది. ఉత్తరదేశపు "తబల" వాద్యమునకు తుల్యమగు ఆనకములు కూడా పూర్వమున వాడబడినట్లు చూతుము. చర్మవాద్యములు నాలుగువిధములగు శబ్దములను (1) ఉచ్చస్వనములు (pitches), (2) బిగ్గరధ్వని (Intensity), (3) గొంతుక వ్యత్యాసము (timber), (4) కాలాదిప్రాణయుతతాళము పలుక గలుగుచున్నవి. ఉడిపి, ఉడుక్కా, బుడుబుడుక్కా, నగారి, ఢోలు మున్నగునవి శబ్దములను పలుక గలిగినను వానివానియందు ఇవి కొంత భిన్నముగనే కన్పట్టు. కంజిర ఘటమువాద్యములు నిటీవలివారు కొంత ఘనముగనే వాయించగలుగుచున్నారు. "తధిగిణతోం" ఇత్యాది శబ్దములు పాశ్చాత్యులకు నూతనములు. పాశ్చాత్యులు చర్మాది

వాద్యములను తాళము చెప్పుటకుమాత్ర ముపయోగింతురు. కాని మనవారు తాళమున ట్లొప్పించియు గానమున కవి సంవాదియై మేళవించునవిగ నొనర్తురు. (vital constituent of the Harmony) అట్లయ్యు నవీన కర్ణాటకసంగీతమందు వాద్యములు గానమును ఒకప్పుడు త్రోసి రాజు చేసి మించి తమ స్వారాజ్యమును నిలబెట్టకొనుచున్న వనుట మరువజాలము. పాశ్చాత్యుల గానమునగల క్రమమగు ధ్వన్యుద్రేకము (graduated intensity of sound) హిందువులకు రుచింపదు. పాశ్చాత్యులకు వారి గానమందలి ఒత్తులు (accent) విరామము (rest) తమవాద్యములు పలికిన చాలును. కాని మన కవి మన గానసాహిత్యమునంతయు బలుకవలసియుంట విదితము. అవిచ్ఛిన్నమగు శబ్దసంతానమును వాద్యములు పలికించుట మన కానందమగుతరి ఆగియాగివాయింపబడు తాళానుసరణీయమైన ధ్వను లప్పుడప్పుడు పలుకుట పాశ్చాత్యుల కానందము.

శబ్దములు. (బోలులు)

భారతీయ తాళమున శబ్దములు ముఖ్యమని యెంచితిమికదా. ఇవి యనేకములు. హల్లక్షరములే అనగా క, ఖ, గ, ఘ, ట, ఠ, డ, ఢ, ణ, త, థ, ద, ధ, న, ర, హ 16 అక్షరములు శబ్దముల కుపయుక్తములుగ నెంచబడెను.

శ్లో॥ జవర్జితః కవర్గశ్చ టతవర్గౌ రహావపి ।
ఇతి షోడశవర్ణాః స్యురుపయోగాః పాటుసంజ్ఞికాః॥

అని సంగీతరత్నాకరమున చెప్పబడెను. ఇప్పుడు వ్యా, మున్నగునవియు చేర్చబడి హాయి యొసగూర్చు మనవారినేర్పు విదితమే. ఉచ్చారణముబట్టి యీాయవి ఆ యాప్రదేశములందు కొంచెము భిన్నముగనే యున్నవి. ఉత్తరదేశపుబోలులకును కర్ణాటకశబ్దములకును కొలది ఉచ్చారణవ్యత్యాసము చూతుము. ఈశబ్దములకు ఇ, ఉ, ఎ, ఒ కారములుకూడ నొప్పింతుము. ఇందుచే నివి పెక్కులు కలవని తెలియుకుము. ఆయాపూర్వపువాద్యములం దేవిధశబ్దములు కలుగునదియు విపులముగ శార్ఙ్గదేవుఁడు వర్ణించినాఁడు.

అక్షరములు పదములై సమాసములై కవిత్వమున విరాజిల్లునట్లు శబ్దములు కొన్ని చేరి గతులై వృత్తములై తాళమున విరాజిల్లును. ఆయాతాళమందలి అంగాది ప్రాణపోషకములై కూడ నుండవలెను. మనోహరముగ వీనినొప్పించు శక్తి ఘనతకు కారణము. అప్పుడే హృదయము పల్లవించి హాయి జెందును. మృదంగాదు లీయంశమును గుర్తింపవలసియున్నది. త్యాగరాజు "సొగసుగా మృదంగ తాళము—జతగూర్చి నిన్ను సొక్కజేయు ధీరుఁడెవఁడో" అని పాడెను. శార్ఙ్గదేవుడు,

శ్లో॥ కవిః కవయతిశ్లోకం శ్రీవణోత్సవ దైః పదైః ।
యథాతథా క్వచిత్కాలే వర్ణాన్ లయ మనోహరాన్ ।
విధాయ వాదకో వాద్య ప్రిబన్ధాన్బధ్న మర్హతి ।
ఇమం కవిత కారాఖ్యం వాదకం బ్రువతే జనాః॥

అనివచించెను.

కర్ణాటక దేశపు శబ్దములు.

ద్రైధరకిటతాహందిత్తా - జేజేర్ఝుం తరిదిగి దిగిదిత్తా - దిత్తరిదిగి దిర్గుడుదిగి దిర్గుడుదిత్తా - తధిమితోదిమి తోంగిట దిత్తాతట్లాం తత్తోంగక్కిట తక్కిట - ధణధణ తదిమహాణ్ణం - దళంగుతక తక దదిగిణ ధ్రాం॥

తత్తాతా - తత్తాతాం - తహతాతా-తధిమిధిమికితక తధిమి ధిమితా - ధిమిధిమితా - ధిమిధిమితా - తధిమి - తధిమి ధిమికితక ధిమికితక - తక్కిట ధిక్కిటనం తధిత్తా - ధిత్తా - ధిత్తా - దిత్తాధిమి-తధిమి ధిమిధిమిక తకధికి-తకతాధిక్కితా- తోంగతోతోంగ - తోంతోంగ తోంతకధి - ధి తోంతోం- తకిడితక - దికిడతం - దికిడతకతక - తకకతక - తకతాం - ధికతాం - తధా - తక తధికతకధికతధి తధిగిణధోం॥ - రేటెకణకణక - రేటక రేటక రేటక - నాకనాక - రేటక రేటకణకణక॥ - దిగిదిగి దిగిదిగి తోగుణ కరకణక - రగణక - తోగణక ... ...॥

ఈశబ్దములను నృత్యమున* గొలిపించుట సామాన్యముగ జూతుము. శ్రౌత్రీయములై మన కాదరణీయములైన "తిల్లాన" అను వానియందును చూతుము. వివిధరీతుల తాళము ననువదించునప్పుడు పాదవిన్యాసము నృత్యము వృద్ధి నొందుచుండును. వివిధపద్ధతు లిట్లుచూడుడు.

అలరిప్పు అనగా నాట్యప్రారంభమున శబ్దముల నుచ్చరించుచు ఒడలు భావయుతముగ గదలించుట.

---

* నాట్యము, నృత్యము, నృత్తముల వ్యత్యాసము గమనీయము.

తాంది - తాత్రితాం - త - కిటతక - త్రికట తద్దిణ తఝ్ఝణు - తద్దిమి - తక్కిట - తకతరికిటతక - తాకిటతద్ది తాకిటతక - తకతద్ధింగిణతోం॥ తాకటతక తాకిటతక - తదిగిణతోం - తాకిటతక - తాకిటతక - తద్దింగణతోం - తా॥
తదణత - ఝుణతకతా - తధిమితకిటతకత్రై - తణఝ్ఝణు. తకధిమి॥ తకదిక - తకతధింగణతోం - తకదిక - తకతదిగిణతొం - తకతదింగిణతొం॥

ఆలాపజతి:—అలరిప్పు యనంతరము జతిస్వరములు వాడుదురు. నృత్తమిందును ప్రాధాన్యమై యుండును.

తాతాం - తకదిక - తదిక్కితక త్రైత్రై తకదికతద్దితక॥

త్రికాలములనొప్పునది:—తహత ఝుంతరి - కిటతరికిటతక - తద్దిరి - తద్దిన - తఝ్ఝణు - తద్ధిమి - తకదికతకు - తద్దిగణతొం - తకతదింగణతొం - తాతాతాం - దిగిదిగిదిగి - దిగిదిగిదిగిదిగి - ధళాంగుతక దికతక - తధిగిణతొం॥

ఒకింత ఆహాభావముల జెప్పుచు నృత్యము సేయుటకు. అనగా స్థాయి నృత్యమున కనువగునవి:—తదా - తద్రై - తద్రై - తదా - తతితెయి - తతత్రై - తతత్రైధా - తాత్రైత్రా - తదా - తా - ధా - ధా॥

అడవలి నృత్యయోగ్యములు:—తదా - త్రై - ద్రై - త్రై - ద్రై - తో - తధా - తాత్రై - త్రైతత్త - తధా - త్రైద్రై - త్రైద్రై - తాతా - దాతాతద్రై - త్రైతత్త - దదా - త్రైతధా -

తా త్రై - త్రై - తా త్రైతఝా - ఝా త్రై - త్రై - ఝాతకదికి - కతక - తకధికితక - తకధిధిగిణతోం॥

"తిల్లాన":- సురటి—ఆదితాళము.

ఉదతోంతనారి - నాదరిదీం - తాందారదోస్తానిదార॥ ఉ॥
తనదీం - నతదీం - తదరదని - దోస్తారదానాదిరినా -
ఉదనిత దనదిరి నాజియాలలీ - ఇంతతనోంతాదదని॥ ఉ॥
చాలనిన్ను పూజించిననాదు-జాలిదీర్చి వేగమెబ్రోవుమునా-
పాల నీకు మన సేలరాదు గోపాల దాసపాప ఘన సమీరణ॥
నాదరిదిరిదాని-తోందిరిదిరిదాని-దోస్తాన-ఇల్లాన తిల్లిల్లా-
నాతందిరినా-నాదిరి తోందిరితోందిరి దివితిల్లానాతానాతందరి
నాదరి - తకదిల్లా నానాదిరి - తకదిల్లానానాదిరి - తోందిరి
నాదరి॥ ఉ॥

కమాసు—ఆదితాళము.

దీందీం తనదిరినా - ఉదనిదని॥ దీం॥ నాదిరి దీందీంతనా -
ఉదనిదనిదోస్తార తా నాదిరినా - తనోంతనన - తనోంతనన-
తనదిరినా - గమపదనిస - రిగరిస॥ దీం॥

ఉత్తరదేశపు బోలు లిట్లున్నవి.

లాహోరు:- దాదిన్ దిన్ దా। దాదిన్ దిన్ దా। దాటిన్ టిన్ టా। దాదిన్ దిన్ దా॥

అలహాబాద్:- టాదిన్ దిన్ నా। టాదిన్ దిన్ నా। దాటిన్ టిన్ నా। టాదిన్ దిన్ నా॥

బొంబాయి:- ద త్రికి దికట ధత్రి। కధికిట ధగి టిట। క్రిధ టిట గడి గిన। దిగ దిగనగ నగ॥



# రాగలక్షణము.



భారతీయ రాగపద్ధతిగూర్చియు, కర్ణాటక మేళకర్తలు రాగవిభాగము గూర్చియు విపులముగఁ జెప్పు గ్రంథ మింత వరకు వెలువడలేదు. ఈ యంశములతోను మరి భాషాంగ రాగముల లక్షణములతోను వెలయింపఁబడిన యీ గ్రంథము సంగీతప్రియుల కత్యంత యుపయోగకరము. ఇందు శార్ఙ్గదేవ, రామామాత్య, సోమనార్యాది, వాగ్గేయుల మతములు చెప్పఁబడెను. ముఖ్యముగ వెంకటమఖి పద్ధతి విపులపరుపఁబడెను.

ఆంధ్రుల భాగ్య మనదగు యీ గ్రంథమాలయందు ప్రతివారు ప్రవేశరుసుము రు 0-4-0 లు ఇచ్చి చందాదారులుగఁజేరి మా యుద్యమమును కొనసాగించుటకు ప్రార్థితులు. వీరికి ప్రకటితమగు ఈచిన్న గ్రంథములు పోస్టేజి లేకయు బంపబడును.

వి౦. వ. నరసింహాచార్యులు,

సంపాదకులు,

ఫ్రేజరుపేట, కాకినాడ.

(తూర్పుగోదావరిజిల్లా.)